# స్రవంతి పాఠకులకు

* తెలుగు
* హిందీ
* ఇంగ్లీషు

సంస్కృత

భాషలలో

అందమైన ముద్రణకు సంప్రదించండి

## దక్షిణ భారత ప్రెస్

ఫోన్ : 37447



ఖైరతాబాదు, హైదరాబాదు-4

ted Printed and Published by P. Prasada Rao on behalf of the D. B. Hindi-Prachar Sabha- Andhra, Khairatabad Hyderabad-500 004,

ఏప్రిల్ -1991

# స్రవంతి

'సాహిత్య చర్చా వేదిక స్రవంతి మాసపత్రిక'



సంపాదకులు : పి. ప్రసాదరావు

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర,
ఖైరతాబాదు, హైదరాబాదు-500 004

# దేశ సమైక్యతకు హిందీ

## హిందీ టైప్ ఇన్‌స్టిట్యూషన్ ప్రారంభోత్సవం



దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఉపాధ్యక్షులు శ్రీ పటగర్ల రామమోహనరావు స్థానిక శ్రీ వాణి టైపు ఇన్‌స్టిట్యూషన్‌లో హిందీ టైపు విభాగాన్ని ప్రారంభిస్తూ-దేశ సమైక్యతకు హిందీ ప్రచార ఆవశ్యకతను వివరిస్తూ రెండు లక్షలపై జనాభా కలిగిన ఏలూరు పట్టణంలో హిందీ టైప్ రైటర్ అవసరం ఎంతయినా వుందని సంస్థ అభివృద్ధికి తన వంతు సహకారం అందిస్తానని ఆయన అన్నారు

సీనియర్ కాంగ్రెస్ కౌన్సిలర్ శ్రీ పుప్పాల సూర్యనారాయణ మాట్లాడుతూ హిందీ ప్రచార ఉద్యమానికి శ్రీ పటగర్ల కృషిని వివరిస్తూ శ్రీ వాణీ టైప్ ఇనిస్టిట్యూట్‌కి శుభాకాంక్షలు తెలిపారు.

హిందీ పండిట్ శ్రీ పొట్టి పాండురంగారావు మాట్లాడుతూ ఏలూరు పట్టణానికి హిందీ టైపు అవసరం ఎంతయినా వుందని, మున్ముందు మరిన్ని హిందీ టైప్ ఇన్‌స్టిట్యూషన్స్ ఏర్పాటు కాగలవన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

తొలుత శ్రీ వాణీ టైపు ఇన్‌స్టిట్యూషన్ ప్రిన్సిపాల్ శ్రీ వి. హరిగోపాల్ స్వాగతం చెప్పారు.

ప్రారంభోత్సవంకు స్థానిక హిందీ పండిట్స్, హిందీ ప్రచారకులు అధిక సంఖ్యలో విచ్చేశారు.

# స్రవం

## సాహిత్య మాసపత్రిక

వార్షిక రుసుము : రూ. 15/-లు    విడిప్రతి : రూ. 1-50

సంపుటి : 38    ఏప్రిల్ 1991    సంచిక : 1


445

()=()

()=()

ఈ సంచికలో    పేజీ




కార్యాలయము

**దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర,**
**ఖైరతాబాద్, హైదరాబాద్**
**పిన్ కోడ్-500 004**

# అన్వేషించు

—పైల కృష్ణారావు

అరణ్యాలు వదలి ఊళ్ళ మీదపడి
అడుక్కు-తినే ఏనుగులులాంటి
అపభ్రంశపు పొట్టకూటి చదువులు వద్దు
శీలాల్ని, వ్యక్తిత్వ బలాన్ని
పెంపొందించే చదువులే నీ సరిహద్దు
కాలు చాచి కాలాన్ని వ్యర్థంగా గడిపితే
కొండయినా కాలప్రవాహంలో కొట్టుకుపోతుంది
దేశాన్ని పరాన్న జీవుల్లా దిగమింగే ఆలోచనే
ఎల్లప్పుడూ పుడుతుంది
వేణువై గుండెలు కరిగించగల వెదురును
బాణంలాంటి దండప్రహార సాధనంగా భావించకు
తాటి చెట్టును చూచి మద్యం మత్తులో పడక
తాళపత్రాల సాహితీ సుధలాస్వాదించు
మట్టి ఆహారంగా మారి మనుష్యుల పొట్టనింపుతోంది
మాటలురాని పశువులు కూడా మానవసేవ చేస్తున్నాయి
పాలు తాగి విషంగా మార్చుకునే పాములా కాకుండా
గడ్డి తినినా పాలుగా మార్చుకునే గోవులా జీవించు
జీవన సాగర మథనంలో విషాదహాలాహలాన్ని దిగమ్రింగి
ఆనంద-పీయూషానికై అనుక్షణమూ అన్వేషించు.

[ప్రాధ్యాపకులు, వీరభద్రాపురం, శ్రీకాకుళం జిల్లా].

# భా ర

గౌరీభట్ల రఘురామశర్మ

1. 'గనులున్నారు వివేక దృష్టిగల వాక్చాతుర్య ధౌరేయస
జ్జనులున్నారు విచిత్ర చిత్రరస శ్లేష ప్రౌఢి నొప్పన్ కవీ
ణ్మణులున్నారు వధాన ధార కవితా మాధుర్యమున్ దెల్పు వా
గ్ధనులున్నారు' అలాంటి వారలకు ప్రాధాన్యమేదో భారతీ!

2. సీ॥ విబుధ విద్వేషంబు విడిచిపెట్టిననాడు
నిజమైన విజ్ఞాన నీతి వరలు
కు కవిత్వముల నోళ్ళు కుట్టివేసిన నాడు
సుకవిత్వ సంపద శోభ నలరు.
కుటిల రాజన్యుల పటిమలుడిగిన నాడు
స్వచ్ఛందమౌ ప్రజాస్వామ్యమలరు
అశ్లీల భావంబు నడుగువట్టిననాడు
సమదృష్టితో సిరిసంపదలలరు''

3. గీ॥ చీడవట్టిన చెడుతనము పీడ వదలి
అంతరించు సుకళకు దీర్ఘాయు విడుచు
కదలి రారండు మేల్కొండు నిదురలెండు
నాటి సాహితీ కళల నీ నాడు నిలుప
భారతీదేవి సంతృప్తి పరుపనేడు

4. శ్రీమత్సంస్కృత సత్కళాలసి వాక్ శ్రీలిచ్చి పాలించక
మ్మా మాధుర్య కవిత్వతత్త్వ గుణసామ్రాజ్యంబు నందించ ర
మ్మా మద్ధారయు ధారణా పటిమ సమ్యగ్రీతి సాగంగరా
నేతుంబై నెరనమ్మునే హృద వాణిశ్రీ కళోపాసు డన్

5. పలుకింపై పద శిల్ప కల్ప సల్ప నల్పంబన్నత ద్రూపపై
తల దాల్చన్ రస రామణీయకత నెత్తావై విరాజిల్లు లీ
లల పద్యాల రచించునట్టి సరసోల్లాసంబుతో హాసమై
నెలవై నిర్వగదమ్మనే హృదయ వాణిశ్రీ కళోపాసుడన్

2-3-529/1/13,
బాపూనగర్, అంబర్ పేట
హైద్రాబాద్-13.

# మన భూమి

—పద్మాంజలి

ఆది కవి నన్నయ్యలో ఆది కావ్యాలే
అవతరించిన అవనిరా మనది,
వేదాలు నాలుగు వేద మంత్రాలుగ
వేనోళ్ళ చాటిన వేదభూమిరా మనది,
అన్నమయ్య కీర్తనలు గొంతెత్తి
పాడుకొని గంభీర మెత్తిన గడ్డరా మనది,
తాగయ్య నాదాలు తను వెల్ల నింపుకొని
తన్మయము చెందిన తల్లి భారతిరామనది,
వేదాభ్యాసాలకు, సంగీత శాస్త్రాలకు
శిల్ప నైపుణ్యానికి సరస్వతి నిలయమై
నిలువెత్తి పొంగిన నేలరామనది,
గాంధీలు, నెహ్రూలు బోసులు,
సింగ్‌లు, రాజులు రమ్యంగ వెలసిన
రణ భూమిరా మనది,
గురజాడ కవితలు, శ్రీశ్రీ గేయాలు గొప్పగా
చెప్పుకొని ఆదరణ పొందిన అవనిరామనది
కులాలు వద్దని, మతాలులేవని, అందరిని
ఒకటిగ అండగ నిలిపిన అమ్మభారతిరామనది
సహనములో, మాకు సాటెవ్వరు లేరని,
ఓర్పుతో మమ్మెవరు ఓడించలేరని దండించి
ధైర్యంగా చెప్పిన ధరణిరా మనది,
ప్రకృతి సంపదలకు, పసిడి పంటలకు
ప్రసిద్ధిగాంచిన బంగారు పుడమిరా మనది.

కె. లక్ష్మీనారాయణ
6-3-164/3/9/4,
ప్రేమ్‌నగర్
ఖైరతాబాద్, హైదరాబాద్-4.

# గెలుపు నీదే

పైలా కృష్ణారావు

మధురగీతం నడచి వచ్చినట్లు
మందహాసం మనసు మీటినట్లు
మౌనరాగం తనువు సోకినట్టు
ఆత్మ చైతన్యసీమలో అరుణోదయమైనట్లు
నీ వాగమించే రీతి
ఈ జగానికి మనోజ్ఞ సమ్మోహన గీతి
మరుభూమిలో సురఝరీ ప్రవాహం సాగినట్లు
మండువేసవిలో గండుకోయిల కలస్వనాలు మోగినట్లు
కాళరాత్రి నీలి నయనాల్లో కార్తీక వెన్నెలలు విరిసినట్లు
మానవాళి మస్తిష్కాలలో కోర్కెల తేనెజల్లులు కురిపిస్తూ
హృదయ సరస్తీరాలలో ఆనందోత్సాహాలు
కన్నెమనసు తలపుల్లా తుళ్ళింతలాడిస్తూ
పుడమితల్లి ఎదమంటలలోంచి
మారణభీరణ భీషణ హోమాల్లోంచి
సుస్నాతవై అవతరించు
మనుషుల్లోంచి మనసుల్లోంచి పారిపోయి
ఏ అరణ్యాల పురాణ ఋష్యాశ్రమాల్లో తల దాచుకొని వున్నావో
నీవు వచ్చి కొన ఊపిరిలో నున్న
సత్యం. సహనం, ప్రేమ, అహింసలకు పునర్జీవనాన్నివ్వు.
నీవు వచ్చి అయోధ్యలో అడుగు పెట్టగానే
బుసకొట్టే సమర సర్ప జ్వాలల నాల్కలు తెగి రాలిపడతాయి.
భుగభుగమంటూన్న మత విద్వేషాల మంటలు ఆరిపోతాయి.
రగులుతూన్న రిజర్వేషన్ల కీలలు
రెపరెపలాడుతూన్న తీవ్రవాద జ్వాలలు చల్లారిపోతాయి.
అతలా కుతలమౌతున్న సమస్త మానవాళి
నీ ఆగమనం కోసమే నిరీక్షిస్తోంది.
అశోకుడు, గౌతముడు, మహాత్ముడు ఎందరో మహానుభావులు

నిన్నే వరించారు— తరించారు.
నీ నీడ నాశ్రయించే వారి బ్రతుకులు మూడు పువ్వు లారు కాయలు
నీ జాడ ననుసరించే వారి చేతలు కీర్తి కిరీట కలికితురాయిలు.
నీవు అశాంతితో అలమటించే అంధకార జగత్తుకు తొలి ఉషస్సు
అభిశప్తులైన ఆర్తులను పునీతులుగా జేసే స్వర్గంగా జలస్రోతస్సు
నీ వాదం మానవాళి నిర్వేదం తొలగించే తొలివేదం
నీ దీవెన ఒక దివ్య భావన
సమస్యల శరాలనుండి కాపాడే ఒక ఆచ్ఛాదన
నీవు అడుగిడిన చోట తొలగిపోతుంది వర్ణ వివక్ష
ఈ విశ్వం ఉనికి, ఊనికలకు నీవే శ్రీరామరక్ష
వేదాలు మొదలుకొని సాహితీవాదాలన్నిటా నీవే నిలిచావు
యుగయుగాలుగా ఈ విశ్వాన్ని ఏ ఆయుధం లేకుండా నీవే గెలిచావు
అజ్ఞానంతో నిన్ను దూరినవారే, నీతో పోరాడినవారే
ఏ నాటికైనా నీల గారిపోయి నీ పాదాక్రాంతులవుతారు.
నీవుంటే అగ్నిపర్వతం లాంటి ఈ లోకం నిద్రిస్తుంది.
నీవు లేకుంటే విద్వేషపు లావా పెళ్ళుబికి భగ్గుమంటుంది.
గర్జించే మేఘాలు, గాండ్రించే బెబ్బులులు
విరిగిపడే సుడిగాలులు, తిరగబడే సముద్రాలు
నీవు నిలబడితే చాలు నీ కాళ్ళ దగ్గర మోకరిల్లుతాయి.
ఆనాటి బ్రహ్మాస్త్రాలు గాని ఈనాటి అణ్వాస్త్రాలు గానీ
నీ బలానికి సలాము చేసే గులాములే
ఓ శాంతీ!
అణువణువునా నిక్షిప్తమై వున్న శక్తిలా
అందరిలో నిగూఢమై వున్న ఆత్మలా అంతటా ఆవహించు
ఈ ధరణిభారము యింక నీవే వహించు
రాజీవంలా, రాజహంసలా అవతరించు
ఏ నాటికీ నీవే అజయవు, అభయవు, అమరవు
గెలుపు నీదే శాంతీ !!

తెలుగు లెక్చరర్, వీరభద్ర పురం,
శ్రీకాకుళం జిల్లా-532220

# మానవతా విజయం

పోతుకూచి సాంబశివరావు

గగనంలో నక్షత్రాలు
మైదానంలో పరిచిన
మల్లెపూవుల్లా మెరుస్తున్నాయి
ప్రతి తార కాంతివంతమే
లక్షల కోట్ల తారలు
ఆకాశశూన్యంలో
మెరుస్తున్నాయ్, చరిస్తున్నాయ్.
కదలికల్లో ఒక పొందు
మెదలికలలో ఒక క్రమశిక్షణ
జగతికి ఆనందం కలిగిస్తుంది.
విభిన్న జాతులలో
మెరుస్తున్న విభిన్న మతాలు
సంఘర్షణకు తావే లేదు
ప్రతీ మతం తెర వెనుక వెలిగే
ఆశయ సిద్ధాంత జ్యోతుల కాంతి
అంతా ఒకటే
అహం బ్రహ్మాస్మి అని విన్నా అర్థం చేసుకున్నా
ఎందుకో వ్యక్తుల మన స్తత్వాల విభేధాలు
మనిషి బ్రతుకు ఒక లీల
ఆ లీలల్లో తెలియని అరిషడ్వర్గాలు
ఆ ఉద్రేకాల్లో మరిచే మమతలు
ఆ మమతల మూలం స్పందిస్తే
అంతా వెలుగే, అంతా ఆత్మీయతే.

ప్రాపంచిక సమస్యల వనంలో
అందాలు చూడగలిగినవాడు
జీవితం ఒక రమణీయమైన పోరాటం
భాషలు వేరైనా భావాలు
అర్థం చేసుకునే మనోగతాలు
ప్రతీ వ్యక్తిలో హృదయ కుహరాలు
గది గది కొక సుందర ద్వీపం
మది మది కొక మధుర నినాదం
ఆధ్యాత్మిక సత్యం అవగాహనలో
ఆదర్శసూక్తులు ఉదయించాలి.
రాజకీయాల రగడల కోసం
భోజకీయాల ప్రగతి కోసం
మనుగడ బలిచేయడం
మారణ హోమం.
ఈజగతి అనంత సుందరి
స్వప్నాల మమతల మధుర వనం
ఇందులో పూసిన రంగురంగుల పుష్పాల
మకరంద మాధుర్యం మమతల సాదృశ్యం
మనిషి హృదిలో అలజడుల సంద్రాలు
స్వార్థజనిత ఆశయ ప్రకోపాలు
భువనంలో ప్రభంజనాలు సృష్టిస్తాయి.
ప్రతీ మనిషి బ్రతుకు గాలి బుడగ
అని తెలిసినా ఎందుకో ఈ వేషాలు

ఏప్రిల్ '91 ; స్రవంతి ; 7

చేతిలోని ఫలం ఇతరులకు కూడా
పంచే మనసు లేని మనిషి
మనుగడ ఎడారి సమానం
ప్రతీ మనిషిలో ఆత్మ ఉందని
అన్ని ఆత్మలు పరంజ్యోతి మిణుగురులని
వేదాంతులు సహోషించినా
ఎందుకో ఆ మిణుగురులు
తమ వొలుసులు చూసుకుంటూ మురుసుకుంటూ
కదిలిపోతున్నాయి.
ఏ మత ప్రవక్త, ఏ సూక్తి చెప్పినా
ఏ దేవుని కుమారుడు హితబోధ చేసినా
ఏ దైవం తన అభయ హస్తం చూపినా
అన్ని భావాల అనంతమైన భాష
అపురూపమైన ఐక్యతా గీతాల ప్రబోధన
మనిషి మనిషి మధ్య
ఉన్నది కూడా కాస్మిక్ శక్తి
ఆశక్తిని ప్రతిమని
అరచేతులు చాచి ఆవాహనం చేసుకోవచ్చు
ఆశక్తి ద్విగుణీకృతంలో
అనంత జ్యోతిలో వెలగవచ్చు.
కాని ఒక మాయలో క్రమంలో
మనిషి సంద్రంలోని కల్లోల కెరటాల
కదిలే చిరునౌకల
అలజడితో కదులుతున్నాడు.
అలజడులు ఆశలకు ఆశయాలకు
కొంత ప్రేరణ కాగలిగినా
మనిషిలో సంచలనం సృష్టించగలిగిన
అలజడుల కన్న మహానంద మమతల
మాధుర్య ప్రశాంత జీవన సిద్ధి
ప్రతివ్యక్తికి అంతిమ లక్ష్యం కావాలి.
అప్పుడే మానవ జీవితంలో
నిరతం మానవతవిజయం, ఆనందం లభిసాయి.

# నే దివ్వెనైతి

కె. వెంకటేశ్వర్

ప్రమద మొంది నీవేళ
ప్రమిదనైతి,
తరియించవలెనని
తిలనైతి.
వలపుతోని
వత్తినైతి.
ప్రేమతోని
వెలుగుచుంటి
దివ్వెనైతి నివ్విధముగా
దివిజవాసుల
దీవెనలందుకోను
దీపాల పండగ రోజని
ఇల్లంతా కొలువైతి
ఇల్లంతా వ్యాపిస్తి
ఈశ్వరరూపంచే
నేననుకొంటి,
జన్మసార్థకం చేసుకోను
జనుల బతుకుల్లో
వెలుగు నింపి శుభోదయం గావింప
నే దివ్వెనైతి ఈ విధముగా.



## 'ఆమ్రగీతం'

తిరునగరి శ్రీనివాస్

పూచిన మామిళ్ళను చూడగానే
లేచి ఆడుతుంది మయూరంలా హృదయం
అల్లంత దూరం నుంచే
ఆమ్రమరీమళాల్ని మోసుకొస్తుంది సమీరం
మావితోపులోకి వెళ్ళి కూచుంటే చాలు
మానసం నిండా మధురోహలు
కొమ్మల్లోంచి గొంతెత్తిన
కోయిల పాటలలోని తియ్యదనంలో
లీనమై పరవశించి పోతాను
హృదయవీణ కమ్మని మోగుతుంది
నాకు ఆమ్రవనం
నాకా నందనంలా తోస్తుంది
కమ్మని ఈ మాకందం
కల్పకంగా అగుపిస్తుంది
మామిడి చిగిర్చిందంటే
మధుమాసం నవ్వినట్టు
మామిడి కాచిందంటే
మాధవం శోభించినట్టు
చక్కని ఈ మామిడి
సర్వమంగళ
కమ్మని ఈ మామిడి
కవితాకల్పకం
ఆమనికి గుర్తు
ఆమ్రం

## అక్షరం

భగ్వాన్

అక్షరమంటే
ఆషామాషీకాదు-అది
భూనభోంతరాళాలను దద్దరిల్లించే శక్తి!
గుండెల కారు చీకటులను చీల్చేకత్తి!!
మనసుల వెలిగే చైతన్యదీపపువత్తి!!
అక్షరాన్ని
అంతతేలికగా చూడకు— అది
పీడిత తాడిత హృదయాల పూచేకొమ్మ!
శ్రామిక జనులను ఆప్యాయించేఅమ్మ!!
అమాయకులకు ఇస్తుంది మరో జన్మ!!
అంధకారంలో క్రమగ్గే మనిషిని
అక్షరమే, నవ ఉషస్సు వైపు నడిపిస్తుంది!
ముత్యాలు మెరిసే కండల గుండెలలో
అక్షరమే, ఆలోచనా విత్తులు చల్లుతుంది!!
అక్షరం—ఓ ఆయుధం!
చేబడితే, బ్రతుకంతా సుందరం!!
అక్షరం- ఓ ప్రసాదం!
ఆరగిస్తే, జీవనమే అతిమధురం!!



# ప

అడిగోపుల వెంకటరత్నం

పిరికితనం మనిషిని కౌగలించుకొంటే
పగలే చీకటి అవుతుంది
తాగేనీరు గరళం అవుతుంది
తినే తిండిలో విషం కలుస్తుంది
కుర్చీకింది నాటుబాంబు పేలుతుంది
సమస్యకు సరిపెట్టుకొనే సమాధానం
పరిష్కారం అవుతుంది
సమస్యకు తెరపడుతుంది
రహదారి గుహలా కనిపించి
నడక మృత్యువు అవుతుంది
బయటకు వెళ్ళినవారు
ఇంటికి తిరిగిరారు
ఆకాశం వూడి నెత్తిపై పడుతుంది
పాదాలు పాతాళంలోకి కుంగిపోతాయి

పడక మృత్యు పాన్పయి
ఉలిక్కిపడి నిద్ర లేచినప్పుడల్లా
బ్రతికి వున్నట్లు నిర్ధారణకై
చేతులు గుండెల్ని వెతుక్కొంటాయి
గోడ గడియారం మృత్యుసంకేతమై
అలారం మరణ మృదంగం అవుతుంది
తలుపు చప్పుడై నప్పుడు
మృత్యుదేవత నృత్యం అవుతుంది
పిరికిని పొదిగిన మనిషి
నిలకడలోంచి జారి
ప్రవాహమై పారు
ప్రవాహమై పారి
నిలకడగా నిలిచిపోకు!



కుందేటి కొమ్మునైన తేవచ్చు గాని, మూర్ఖుని మనసు మాత్రం మార్చలేం

# ఆరాలాపము

శంకరగంటి రమాకాంత్

ఓయి దేముడా! నీవేమొ హాయిగాను
ఠీవిగా కూరుచున్నావు దేవళమున
భాగ్యహీనునిగా, నన్ను యోగ్యునిగ సృ
జించినావు, నే నేరము చేసినాను.
పెదవి కడదాక ఏతెంచి పృథివిని ఒడి
చిటిలి పోయె సుధా పూర్ణ ఘటము నేడు
అమృత రసమాన నేచేసినట్టి తపము
చాలదా ఏమి? ఇంకెన్నినాళులిట్లు
కటుపరీక్షల పాల్జేతొ కపట వటువ!
బన్నముల నెన్నొ చవిచూసి బడలినాను
బంధువుల విమర్శా పరంపరల కఱకు
అంపపుంగోత లంబడి క్రాగినాడ
దుఃఖ వారాశిలో చిక్కుదోగినాడ
వెతల ముళ్ళడొంకలబడి బ్రతుకుబండి
లాగి లాగి డస్సితినోయి, లావుచచ్చె.
ఇక పరీక్షల నాపి స్వామి! కరుణాసు
ధామధురమూర్తి! నాకొక దారిచూపు

2

ఇన్నిరోజులనుండి నేనెంతో పెరిమె
చక్కగా పెంచుకొన్న ఆశామరాళి
కాల పురుష కిరాత కింకర కరాళ
పాణి బాణాగ్ని లోబడి భస్మమాయె.
మసక వెన్నెల లోపన మార్గమందు
ఎంతొ శ్రమ కోర్చి నేపయ నించుచుండ
కఱకు విధియను రాకాసి కారు మబ్బు
చిడుత నెలరేని నాక్రమించినది తుదకు
కట కటా! ఏలనో నేడు కర్కశముగ
విధియె సుడిగాలివలె రేగి, విర్రవీగి
మినుకు మినుకు కంచు స్వల్పకాంతిని ఒసంగు
ఆముదపు దివ్వియను గూడ ఆర్పివేసె.

3

నాదుకూడ సాజముగ అందరి విధాన
అందమైన జీవితముపై ఆశకలదు
కాని కఠిన పాషాణాగ్ర కంటకోగ్ర
దారుణమైన పథమె నాదారి అయ్యె.
కష్ట కాలకూట విషమ్ము కంఠమందు
భద్ర పరచితి రెండవ రుద్రునివలె
దాని దుస్సహ తాపమ్ము తట్టుకొనెడు
శక్తినాకు ప్రసాదించు స్వామి! నీవు.
సహన శీలమ్ముతో వ్యథా దహన శిఖల
కాలిపోయితి; నశియించె కల్మషమ్ము
పులుతొలంగిన అపరంజివలె నయితిని
చిరుత కాన్కగా నను ప్రభూ స్వీకరింపు,
ఎంత ఆపద వచ్చిన ఏమియైన
దేవ దేవుడ! పావన తావకీన
చరణ పంకజముగళ సంస్మరణమాన
ఒడ్డు చేర్చుము నన్నెదో ఒకవిధాన.

# కామాయనీ మరియు విశ్వంభర సామ్యము

గౌని అంజన్ భగవాన్ దాస్ గౌడ్

'కామాయనీ' మరియు 'విశ్వంభర' ఆధునిక మహాకావ్యములుగా ఖ్యాతి గడించినవి. శ్రీ స్వర్గీయ శ్రీ జయ శంకర్ ప్రసాద్‌గారు 'కామాయనీ' యను కావ్యమును హిందీ భాషలోను మరియు డా॥ సి. నారాయణ రెడ్డిగారు 'విశ్వంభర'యను కావ్యమును మధుర-మధుర తెలుగు భాషలో వ్రాశారు. ఈ రెండు కావ్యముల యొక్క తులనాత్మక (Com-pararive) అధ్యయనము అభిలాషనీయము.

**డా॥ సి. నారాయణరెడ్డిగారి వ్యక్తిత్వము :**

కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారికి తెలుగుసాహిత్యములో ప్రప్రథముగా జ్ఞాన పీఠ బహుమతి క్రీ.శ. 1970లో లభించినది. ఆ తరువాత క్రీ.శ. 1988 సంవత్సరమునకుగాను 24వ జ్ఞాన పీఠ బహుమతి మన తెలుగు ముద్దు బిడ్డ డా॥ సి. నారాయణరెడ్డిగారికి లభించడం మన ఆరు కోట్ల తెలుగు వారికి ఆనందకరమైన విషయము. జ్ఞానపీఠ గ్రహీతలందరిలోడా॥ సి. నారాయణరెడ్డి గారు చిన్నవారు, అనగా అంతకు ముందు ఈ బహుమతిని పొందినవారు 60 సం॥లు దాటినవారే ఈ జ్ఞానపీఠ బహుమానము డా॥ నారాయణరెడ్డి గారికి 1968 సంవత్సరమునుండి 1983వ సంవత్సరము వరకు సాహిత్యక్షేత్రమున అతడుసల్పిన అవిరళ కృషికి-'మంటలూ-మానవుడూ' మరియు "విశ్వంభర'యను కావ్యాలను ప్రాతిపదికగా జేసుకొని నొసంగబడినది,

డా॥ నారాయణరెడ్డిగారు దివి 28. జూలై 1931 సం॥న కరీంనగరము జిల్లాలోని ప్రకృతి శోభకు నిలయమైన 'హనుమాజీపేట'యను గ్రామమందు బుచ్చమ్మ-మల్లారెడ్డియను పుణ్యదంపతులకు జన్మించారు. బాల్యదశ నుండి వీరికి సంగీతము-సాహిత్యము అన్న అధిక ప్రీతి. వారి అభిరుచి ఫలితమే నేడు మనము చూస్తున్న 40 గ్రంథములు వీరి సాహిత్యం గొప్ప విశిష్టత కలిగి ఉండడం వల్ల కొన్నింటిని భారతీయ భాషలలోకి అనువదించారు, అందులో ముఖ్యమైన వారి సమగ్ర కావ్యం 'విశ్వంభర' ఒకటి, దీనిని ప్రొ, 'భీమసేన్'నిర్మల్ గారు హిందీ భాషలోకి అనువదించి హిందీ సాహిత్యమునకు అనగా హిందీ ప్రజలకు పరిచయము చేశారు.

'విశ్వంభర' కావ్యకళా ఖండానికి ఎన్నో గొప్ప బహుమతులు లభించాయి, వాటిలో సోవియట్ నెహ్రూ బహుమానము, భారతీయభాష బహుమానము ముఖ్యములైనవి డా॥సి॥నారాయణరెడ్డిగారికి సాహిత్య

అకాడమి బహుమానము 1974 సం॥న లభించినది. శ్రీ రెడ్డిగారు దాదాపు 300 సినిమా పాటలను వ్రాశారు. వీరి 'రామప్ప' నాటకమును భారతీయ 14 భాషలలోకి అనువదింప బడినది.

డా॥సి. నారాయణరెడ్డి గారికి 59 సం॥ల వయస్సు గలదు, ఇతడు చక్కని పాండిత్యము గలవాడు, ప్రతిభావంతుడు, చైతన్యం, సౌజన్యం, నవత, మానవత, మానవత అతని వ్యక్తిత్వంలో విశేషమైన అంశాలు. మధుర గాయకుడు, మధుర భాషి, అంతేకాకుండా తనమాటే పాటగా మలచగల శక్తి సంపన్నుడు. ఇతనిని 'నవ్యగేయ మహాకవి,' 'గేయ కవి సామ్రాట్,' ఆధునిక కవితా మహా ప్రభువు, అభినవ సార్వభౌముడు, గేయ భగీరధుడు ఆంధ్ర రవీంద్రుడు 'ధ్వని చక్రవర్తి,' 'అభినవ జయదేములు,' నవరసాల మూర్తి వంటి అనేక బిరుదములతో సన్మానించారు కానివీరిది బిరుదము లకు ప్రశంసలకు పొంగిపోయే వ్యక్తిత్వం కాదు. ఈయన గారిని ప్రజలు ప్రేమాభి మానముచే 'సి నారె' అని పిలుస్తారు. వీరు ప్రస్తుతము తెలుగు విశ్వవిద్యాలయ ఉపకులపతిగా ఉన్నారు. తెలుగు సరస్వతి కంఠాభరణములుగా సాహిత్య గ్రంథము లను సమకూర్చుచున్నారు.

డా॥ సి. నారాయణరెడ్డిగారి కృతులపై పరి శోధన చేసి శ్రీ గురప్ప చౌదరిగారు పిహెచ్.డి. పట్టమును పొందినారు. శ్రీ రవికంటి వసునందన్ గారు 'భూమిక'ను గురించి సిద్ధాంత వ్యాసాన్ని వ్రాసి యం.ఫిల్ పట్టం పొందినారు; శ్రీ జి. గోవర్ధను గారు నారాయణరెడ్డి-కవిత్వము సంప్రదాయము-ప్రయోగములు శీర్షికపై సిద్ధాంత వ్యాసాన్ని వ్రాశారు. తదనంతరము శ్రీ చెంగారెడ్డిగారు 'నారాయణరెడ్డి గేయ కథ కావ్యము' శీర్షికపై పరిశోధన సిద్ధాంతాన్ని వ్రాసి యం. ఫిల్ పట్టమును పొందినారు. శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం నుండి శ్రీ.జె. శ్రీహరిగారు 'విశ్వంభర ఇతిహాసం' శీర్షికపై సిద్ధాంత వ్యాసమును వ్రాసి యం.ఫిల్. పట్టమును పొందినారు.

డా॥ సి. నారాయణ రెడ్డిగారు కవి, విమర్శకుడు, ఖండకావ్యములు, కథాకావ్యములు, గేయ నాటికలు, సమగ్ర వచన కావ్యము, గద్య నాటిక రచయిత, సాహిత్య వ్యాస కారుడు, పరిశోధకుడు, యాత్రా సాహిత్యకుడు అనువాదకుడు, ఇలా ఇతని రూపాలెన్నో చెప్పడానికి కూడ వీలుకాదు

## నారాయణరెడ్డిగారి కృతుల అనుక్రమణిక

1 లలితగేయ సాహితి :-

పూలపాటలు-1952.

2 గేయనాటికా సాహితి:-

1) నవ్వనిపువ్వు-1953, 2) అజంతాసుందరి-1955, 3) తరతరాల తెలుగు వెలుగు-1975, 4) వెన్నెలవాడ-1959.

ఖండకావ్య సాహితి:-

1) జలపాతం-1953. 2) నారాయణరెడ్డి గేయాలు-1955. 3) దివ్వెల మువ్వలు-1959. 4) అక్షరాల గవాక్షాలు-1965, 5) మధ్యతరగతి మందహాసం-1968, 6) మరోహరివిల్లు-1969, 7) మంటలూ మానవుడూ-1970, 8) ముఖాముఖి-1971 9) మనిషి-చిలక-1972 10) ఉదయం నాహృదయం 1973. 11) మార్పు నా తీర్పు, 12) తేజస్సు నా

తపస్సు-1975 13) ఇంటి పేరు చైతన్యం-1976 14) మంథనం-1978 15) మృత్యువునుంచి-1979

4 సుదీర్ఘగీతి కావ్య సాహితి:-

1) విశ్వగీతి-1954, 2) భూమిక-1977

5. కథాగేయకావ్యసాహితి :-

1) నాగార్జున సాగరము-1955 2) స్వప్న భంగం-1957. 3) కర్పూరవసంతరాయలు-1957 4) విశ్వనాథ నాయడు-1959 5) ఋతుచక్రం 1964 6) జాతిరత్నం-1967

6. నాటికా సాహితి :-

1) రామప్ప -1960 2) నారాయణరెడ్డి నాటికలు- 1978

7. గేయ సూక్తి సాహితి :

సమదర్శనం-1960

8. వ్యాస సాహితి:-

1) వ్యాససాహితి-1965. 2) మావూరు మాట్లాడింది-1980. 3) సమీక్షణం-1981.

9. పరిశోధన సాహితి:-

ఆధునికాంధ్ర కవిత్వం సంప్రదాయములు-ప్రయోగములు-1967

10. అనుశ్రృజన సాహితి:-

1) గాంధీయం 1969. 2) మీరాబాయి-1972) 3) శిఖరాలు-లోయలు-1974 4) ముత్యాంకోకిల-1978

11. వ్యాఖ్యా సాహితి:-

మందార మకరందాలు-1978.

12. యాత్రా సాహితి;-

1) ముచ్చటగా మూడు వారాలు- 1968 2) సోవియట్ రష్యాలో పది రోజులు-1972 3) పాశ్చాత్య దేశాల్లో 50 రోజులు-1974

13. చి||

పగలే వెన్నెల ....

14. వచన కావ్య సాహితి

'విశ్వంభర'-1980.

## శ్రీ జయశంకర్ ప్రసాద్ గారి వ్యక్తిత్వము:-

శ్రీ జయశంకర్ ప్రసాద్‌గారు క్రీ.శ. 1889 సంవత్సరమున కాశీలో జన్మించారు ఇతని తండ్రి శ్రీ దేవిప్రసాద్‌గారు మరియు తల్లి శ్రీమతి మున్నీ దేవి ఇతని ప్రారంభ విద్య ఇంటి వద్దనే జరిగినది. ఆ తరువాత కింగ్స్ కాలేజీలో 7వతరగతి వరకు చదువు కున్నాడు. ఇంటి వద్ద ఇతడు సంస్కృతము, హిందీ వేదములు ఉపనిషత్తులు ఇతిహాసములు మరియు కావ్య శాస్త్రమునకు చెందిన వివిధ విషయాలను అభ్యసించేవాడు. ఇతని మిత్రుడు విశ్వంభర 'జిజ్ఞా'యను నతడు ప్రసాద్ గారి గూర్చి ఇలా వ్రాసారు- 'ఎనిమిది తొమ్మిది సంవత్సరముల వయస్సులోనే ప్రసాద్‌గారు అమరకోశమును మరియు లఘు కౌముదీ యను గ్రంథములను కంఠస్థము చేశాడు.' ఇతని గురువైన శ్రీమోహన్ లాల్ గుప్త ప్రసాద్ గారికి కవిత్వము వ్రాయడానికి ప్రోత్సాహమిస్తుండేవారు.

ప్రసాద్ గారికి రెండు వివాహములు జరిగినవి, కాని అతని భార్యలు స్వర్గస్థులైనారు. కావున అతని మూడవ వివాహము ఒక విధవ రాలితో జరిగినది. ఈ మూడవ భార్యకు కలిగిన పుత్రరత్నమే 'రత్నశంకర్ ప్రసాద్' ప్రసాద్ గారి బాల్యదశలోనే తల్లిదండ్రులు

తదుపరి భార్యలు, అన్నగారు స్వర్గస్థులు కావడము, వ్యాపారము, ఆస్తులు-అంతస్థులపై వ్యామోహము లేకపోవడంచే మరియు సదా సాహిత్యమూర్తిగా ఉంటు సరస్వతీదేవి సేవ చేస్తుండుటచే అతనికి ఎన్నియో కష్టములు ఎదురయినవి. నికిల్సన్ (NICHOLSON) గారన్నట్లుగా- "Personality is a state of tenstion and can continue only if that is maintained" అనగా కష్టాలతో జీవితము గడుపుటచే మానవుని ఈ వ్యక్తిత్వము ప్రకాశించును. ప్రసాద్ గారు తన జీవితములో ఎన్నియో కష్టాలు-నష్టాలు-బాధలు భరించి నీలకంఠుడయాడు.

దినచర్య :

ప్రసాద్‌గారు ప్రతిదినము సాహిత్యసేవలో నిమగ్నుడై యుండెడివాడు. అతడు ప్రతిదినము నడచి బేనియా పార్కునకు వెళ్ళి అక్కడ గంటల తరబడి కూర్చుండి ప్రకృతిని నిరీక్షించెడివాడు. ప్రతి దినం ఉదయం 10 గంటలకు వ్యాయామముచేసి 12 గం॥లకు సకాలములో భుజించెడివాడు. తరువాత 2 గం॥ నిద్రించెడివాడు 3 గం॥ల నుండి రాత్రి 10 గం॥ వరకు దుకాణములో ఉంటూనే సాహిత్య కార్యక్రమములు చూచుకొనెడి వాడు.

వినోదము-అభిరుచి:

ప్రసాద్‌గారికి విశాల విశ్వమే అతని పుస్తకము; అతడు ఎప్పుడు పుస్తకపఠనములోనే కాలము గడిపెడివాడు. సహృదయుడు, సౌంధర్య ప్రియుడు లలిత కళలన్న అతనికి పంచప్రాణము అతడు సముద్రగుప్తునివలె సంగీతమన్న చెవికోసుకొనెడి వాడు. అందుచేత అప్పుడప్పుడు గాయకురాండ్ర ఇంటికి వెళ్ళెడి వాడు. అతనికి ఎన్ని కష్టాలు—నష్టాలు వచ్చిన కూడ వాటిని లెక్కించక కుండ ఉండెడివాడు. జాతరలన్న-ఆటలన్న అతనికి ప్రేమ కాశీ నగరములో హోళి పండుగ సందర్భమున రామ-కృష్ణ వేషధారులను చూచి ఆనందించెవాడు. ఏకాదశి పండుగనాడు కాశీ విశ్వేశ్వరుని మందిరానికి పూజలు సల్పుటకు వచ్చు రమణుల వివిధ రకములైన వస్త్ర-భూషణాలను తిలకించేందుకు గాను అతడు అక్కడికి వెళ్లెడివాడు. అతనికి పడవ ప్రయాణమనిన అధిక ప్రీతి అతడు శాఖాహార ప్రియుడు, మాంస-మద్యపానాలన్న అతనికి ఏ మాత్రము గిట్టవు. అతడు పాకశాస్త్ర నిపుణుడు. విజ్ఞాన విహారయాత్రలలో అతడు స్వయముగా వంటచేసి ఆనందముతో వడ్డించేడి వాడు.

శీలమునకు మారుపేరు ప్రసాద్‌గారు పరోపకారి, త్యాగశీలి, కామములో మమత, కరుణ, స్నేహము మొదలగు వానిపై అతనికి మక్కువ ఎక్కువ. అట్లే అతని జీవితములో పరిపూర్ణప్రేమ, మమత, అహింస, కరుణ మరియు దయాభావమును కలిగిఉండెడివాడు. అతని వదినెగారి మాటలు ఇలా ఉన్నాయి—"నాకొరకు ప్రసాద్ శంకర స్వరూపుడే—" ప్రసాద్‌గారు ఆస్తికుడు మరియు ధర్మనిష్ఠ కలిగినవాడు కూడ. అతని దైవము 'శివుడు'.

భ్రమణము :

జయశంకర్ ప్రసాద్‌గారు తరచుగా సారానాధ్ స్థూపము వద్దకు వెళ్ళి అక్కడి మూర్తులను గంటల తరబడి తిలకించెడివాడు. అక్కడి ప్రాచీన శిలా-ఖండములను చూస్తూ అతని మనస్సులో అట్టి వస్తువుల ప్రాచీన సాకారరూపము ఊహించెడివాడు.

వేష–భాషలు :

అతని శరీరము వ్యాయామముచేత బలిష్ట మైనది మరియు ఆకర్షణీయమైనది. ఆతడు శాంతి పురి ధోవతి-మల్‌మల్ లాల్చి, కళ్ళకు కళ్ళజోడు, చేతిలో బెత్తం ధరించెడివాడు. ముఖము గుండ్రముగా మరియు వెంట్రుకలు చిన్నవిగా నుండెడివి. అతనిని చూచిన వారికి ఒక దివ్యమూర్తిని కాంచినట్లు అగుపించేది.

స్నేహితులు :

ప్రసాద్‌గారి ప్రియమిత్రులు రామకృష్ణ దాస్‌గారు, వినోద్‌శంకర్ వ్యాస్‌గారు మరియు పాండేయ్ బెచన్ శర్మ 'ఉగ్ర' వీరు ముగ్గురు త్రిమూర్తులుగా ఉంటూ అప్పుడప్పుడు కవితా గోష్ఠులకు వెళ్ళేవారు. ఇతని ఇతర మిత్రులు మైథిలీశరణ్ గుప్త, సుమిత్రానందన్ పంత్‌గారు, 'నిరాల' ఆచార్య రామ్‌చంద్ర శుక్ల జైనేంద్ర కుమార్, ప్రేమ్‌చంద్ మరియు మహాదేవివర్మ.

నిర్యాణము ;

మినాండర్ (Menander) అన్నమాటలు "He Whom God loves dies Young". అన్నట్లుగా ఎవరు ఈ ప్రపంచకర్తకు ప్రీతిపాత్రుడో అతడు చిన్న వయస్సులో మృత్యువాత పడును సాహితీమూర్తి శ్రీ జయ్‌శంకర్ ప్రసాద్ గారు క్షయవ్యాధి వలన తేది 15 నవంబర్ 1937 సం॥న మరణించారు.

## ప్రసాద్‌గారి కృతుల అనుక్రమణిక

1 కావ్యములు

1) చిత్నాధార్-1906–1909, 2) కానన్ కుసుమ్-1912-1913, 3) మహారాణాకా మహత్వ -1914, 4) ప్రేమ్-పథిక్–1915, 5) ఝర్‌నా 1916-1919, 6) ఆంసూ-1925, 7) లహర్-1931-32, 8) కామాయనీ-1913.

2 చంపూకావ్య సాహితి :

1) ఊర్వశీ, 2) ప్రేమ్‌రాజ్య.

3 గేయనాట్య సాహితి :

కరుణాలయ్-1913.

4 నాటక సాహితి :

1) రాజ్యశ్రీ- 915, 2) విశాఖా-1921, 3) అజాతశత్రు–1922, 4) జన్‌మేజయ్ కా నాగ్ యజ్ఞ-1926, 5) కామ్‌నా–1923-24, 6) స్కంద గుప్త-1928, 7) యశోధర్మదేవ్ (ప్రచురణ కానిది) 8) ధ్రువ్‌స్వామిని-1933

5 ఏకాంకిక సాహితి :

1) సజ్జన్-1910-11, 2) కర్యాణి పరిచయ్ 1912, 3) ప్రాయశ్చిత్-1924, 4) ఏక్‌ఘూంట్–1929.

6 నవలా సాహితి ;

1) కంకాల్-1930, 2) తితిలీ-1633-34 3) ఇరావతి-(అప్రకాశితము–అసంపూర్ణము)1936

7 జీవిత చరిత్ర ;

చంద్రగుప్త మౌర్య-1931.

8 కథాసాహితి ;

1) ఛాయా-1912, 2) ప్రతిధ్వని-1925, 3) ఆకాశ్‌దీప్, 4) చిత్రాధార్-కీ కహానియా, 5) ఆంధీ-1939, 6) ఇంద్రజాల్ 1936.

9 వ్యాససాహితి ;

1) కావ్య-1936, 2) కళా-1936 3) ఇతర వ్యాసాలు.

10 పరిశోధనా వ్యాససాహితి ;

ప్రాచీన ఆర్యవర్త ఔర్ ఉన్కా ప్రథమ్ సామ్రాట్.

11 సంపాదకీయ విమర్శలు మరియు లేఖాసాహితి

1) ఇందు, 2) జాగరణ్, హంస్ మొదలగు వాటిలో అక్కడక్కడి ప్రచురితమైనట్టి

'విశ్వంభర'–ఇతి వృత్తము :

'విశ్వంభర' కావ్య నాయకుడు మానవుడు. రంగస్థలము విశాల ప్రపంచము. ఈ కావ్యము యొక్క కథ మానవ వికాస కథ ఈ కావ్యానికి పాత్రధారులు ఉన్నారు. మరియు లేరు కూడ. ఇట్టి కథకు నేపథ్యము ప్రకృతి అని, మనిషి ధరించే వివిధ భూమికలకు మూల ధాతువులు మన శక్తులని కవిగారన్నారు.

కామం, క్రోధం, లోభం, మదం, ఆత్మశోధనం, ప్రకృతి శక్తుల వశీకరణం–ఇలా ఇలా నారాయణ రెడ్డిగారు ఎన్నెన్ని విభిన్న శక్తులో మనిషివని అన్నాడు. మానవుడు ఒక్కొక్కప్పుడు వీరాధివీరునిగాను మరియొకప్పుడు త్యాగశీలిగాను, ప్రపంచమనె రంగస్థలముపైకి వచ్చుచున్నాడు. మరియు నటన జేస్తున్నాడు. మనిషి ఒకప్పుడు గొప్ప చక్రవర్తిగాను, ఈ ప్రపంచమనేరంగస్థలం పైకి వచ్చేనటిస్తున్నాడు. 'విశ్వంభర' కావ్యములో మహాత్ముల యొక్క వ్యక్తిత్వము ద్వార మానవుని వికాసమును కళ్లకు కట్టినట్లుగా చిత్రీకరించబడినది. ఉదా : అలెగ్జాండరు. యేసు, అశోకుడు, సుకరాత్, బుద్ధుడు లింకన్, లెనిన్, మార్క్స్, గాంధీ—ఈ విధముగా మానవుని నానా రూపములను వర్ణింపబడినవి.

మానవ వికాసము త్రిముఖము–కళాత్మకము, వైజ్ఞానము, మరియు ఆధ్యాత్మికము ఇట్టి సాధనాత్మక ప్రపంచములో అడుగడుగున తగులునవి ఎదురు దెబ్బలే, అయినప్పటికి మానవుడు వెనుకంజ వేయక ముందంజ వేయుచునే ఉన్నాడు.

'విశ్వంభర' కావ్యం ఐదు ఖండాలుగా—పంచ భూతాలుగాను మరి వేరొక వైపు పంచేంద్రియాలు స్ఫురిస్తాయి. ఈ కావ్యానికి నిజంగానే ఐదుపంచ భూతాలు పంచేంద్రియాలూ.

ప్రథమ సర్గ :

ఆది దంపతుల ద్వార మానవ వికాసము చూపించబడినది. ఆదమ్ (Adem) మరియు ఈవ్ (Eve) ప్రణయగాథ ఇందులకు నిదర్శనము ఇందులో పాతరాతి యుగయు-మానవ జీవితము గుహసారంగములో నివసించడము, గుడిసె నిర్మించుకోవడము, అగ్ని ఉత్పత్తి చేయడం, ఆత్మరక్షణ కొరకు కత్తులను తయారు చేయడం వంటి లోహయుగ పనుల నుండి క్రమక్రమముగా సింధు నాగరికత నుండి ఆధునిక కాలము వరకు చెందిన వైజ్ఞానిక వివిధ విషయాలకు సంబంధిత గృహ నిర్మాణము, వస్త్రధారణ, దేశాక్రమణ, జలప్రయాణము. పర్వత భేదనము, వ్యవసాయము, జంతు పోషణ, వాహనాల నిర్మాణము మొదలగు అనేక కార్యములను నిర్వహిస్తు మానవుడు నేడు 'విశ్వంభర అంతట విస్తరించిన వైనాన్ని సంక్షిప్తముగా తెలిపినారు.

ద్వితీయఖండములో మానవుని కళాత్మకశీలతకు మచ్చుతునక—సంగీతము, నృత్యము, కవిత్వము, చిత్రలేఖనము, శిల్పకళ మొదలగు లలిత కళలలో మానవుని అపార విద్వత్తు ప్రదర్శింపబడినది.

తృతీయసర్గ:-

తృతీయ సర్గములో మానవుని యొక్క వివిధ వింత మనస్తత్వాలను చక్కగా వర్ణింపబడినది. కామ క్రోధ, లోభ, ఇత్యాది ప్రవృత్తులకు గురియై మానవుడు పతనమొందే విధానాన్ని మరియు సత్యము, సత్వము, దయ కరుణ మొదలగు వాని చేత మానవుడెలా ప్రకాశిస్తాడో ప్రతీకాత్మకంగా వర్ణింపబడినది

సృష్టికి ప్రతి సృష్టి చేయు విశ్వామిత్రుని తపస్సు మరియు గౌతమ బుద్ధుడు చేసిన తపస్సును నిదర్శనముగా ఎత్తి చూపినాడు కవి. వీరిద్దరిది తపస్సే కాని విశ్వామిత్రుని తపస్సు-స్వార్థపరతకు మరియు కామానికి గురియై కలంకితమైనది మరియు గౌతమ బుద్ధుని తపస్సు లోక కళ్యాణమునకు ఉపయోగపడినవి.

మనిషిలోని ధరాలోభానికి ప్రతీకముగా అలెగ్జాండరునూ, అశోకుణ్ణి గ్రహించి, ఒకరి వికట తత్వాన్ని మరియొకరి వివేకాన్ని చూపుతు పతనోత్థానాలను ప్రదర్శింపజేశారు, అట్లే సత్యస్థాపనకై ప్రాణాన్ని విషపాత్రకు అర్పించిన సోక్రటీసును, మనిషిని-మనిషిగా తీర్చిదిద్ది జ్ఞానానికి సంకేతముగా గాంధీగారిని కవి చూపించాడు ఇలా-ఖండములో మానవుని వృత్తులను-ప్రవృత్తులను చూపించబడినవి.

చతుర్థ సర్గ :-

ఈ సర్గలో మానవుడు ఆధ్యాత్మికంగా సాధించిన సిద్ధులనూ, వైజ్ఞానికంగా సాధించిన వివిధ విషయాలను వర్ణిస్తూ మానవుని నిరంతర అవిరళ సాధనా తత్పరతను వర్ణించారు. ఆధ్యాత్మిక పరమైన భక్తి మార్గాలు, నానా మత సిద్ధాంతాలూ, అన్ని ఇందులో నిగూఢంగా కనిపిస్తాయి.

పంచమ సర్గ:-

మానవుని భవిష్య ప్రగతి మరియు అందుకుగాను అతడు చేయు ప్రయత్నములు వర్ణింపబడినవి. ప్రగతి పథంలో వరాంహంకార పద్ధతి వంన వినాశము తప్పదను విషయము స్పష్టము చేయబడినది. నేడు మానవుడు మహనీయుడై బురదలో మునిగి ఉన్న ముళ్ళను సహితము లెక్కచేయకుండ ముందంజ వేయుచున్నాడు, మానవునకు పెక్కు కష్టములు వచ్చినను ఆతడు జంకు-గొంకు లేకుండ వాటిని ఎదిరిస్తు మౌనమే నినాదంగా, మందహాసమే మహాశాస్త్రమువలె, సహనమే కవచమువలె, శాంతమే ప్రవచనముగా అనుకొని ముందంజవేస్తు దేవతలకు నమస్కృతులిడుతు, కఠిన విషయములను- సులభముగా జేయుచు, పురవాసులకు పాఠాలు నేర్పుతు, తన చేతిలో నరాదులను ప్రశాంతముగ నిర్జీవులను-సజీవులుగా, గడ్డి పోచలను-ధ్వజస్తంభముగా, మేక కంఠమును సింహనాదములా మార్చుచున్నాడు మనిషి-మహా మనీషి

విశ్వమానవ కల్యాణమునకు మహాపురుషుల ద్వారా నిర్మింపబడిన సామాజిక సిద్ధాంతములు, ఆలక్ష్యాల సాధనకు గాను- వారు సల్పిన ఆందోళనల వర్ణనలు ఉన్నాయి, 'లింకన్' మానవులంతా సమానులంటు సమతను-మమతను పెంపొందించుచు, ధనవంతుల శోషణ నుండి విముక్తి కొరకు కూడ ప్రయత్నించారు. శ్రామికుల ఉద్ధరణ-అభివృద్ధి కొరకు-ప్రయత్నించు 'మార్క్స్' శాంతి అహింసల ద్వారా భారతదేశమునకు స్వాతంత్ర్యము సాధించిన రథ సారథి గాంధీ మొదలగు మహా పురుషులను ఈ సర్గములో ప్రకాత్మకత (Simbol) ద్వార చూపినారు. ఎక్కడ కూడ వ్యక్తిపేరు స్వీకరించక వారి కార్యములనే వర్ణించారు కవిగారు. మానవుని సాధన త్రిముఖము-కళాత్మకము, వైజ్ఞానికము మరియు ఆధ్యాత్మికము, అందుకొరకు ఎన్నికష్టాలు వచ్చినా

వాటిని ఎదిరించసాగాడు మానవుడు. అహింస' సహమానవ జీవనము, మరియు వ్యక్తి ప్రధానము కాక వ్యక్తియొక్క శక్తికి విలువ నివ్వబడినది.

ఈ 'విశ్వంభర' కావ్యములో సహమానవుని హాసం నుండి సహమానవ జీవనము వరకు వర్ణింపబడినది?

'విశ్వంభర' వచనకవితా ప్రక్రియలతో సమ్మిళితమైన ప్రబంధ కావ్యము. ఈ కావ్యము శబ్దము, అలంకారౌచిత్యము, కల్పన మొదలగు గుణములచే నిండియున్నది ఈ కావ్యములో సూక్ష్మకథ వస్తువు, భావప్రధాన భాష, బింబ విధానములో వ్యంగ్యము, మరియు ప్రతీకశైలి కలసి ఉన్నవి.

ఆదిమ దశనుండి ఆధునిక దశవరకు కళాత్మక విధానముతో వైజ్ఞానిక, ఆధ్యాత్మిక రూపాలలో వృద్ధిచెందుతు మానవ ప్రగతిని ఇతిహాసిక, పౌరాణిక మరియు ప్రతీక విధానములో వ్రాయబడిన ప్రబంధము కాని కవి ఈ కావ్యాన్ని 'సమగ్ర కావ్య' మంటాడు. ఇది కవియొక్క సౌజన్యమునకు నిదర్శనము ఈ కావ్యము సహృదయ పాఠకులను ఆలోచింపజేసే ప్రశ్నోపనిషత్తు ఇది.

కామాయనీ–ఇతివృత్తము :

'కామాయనీ' కావ్యము శ్రీ జయశంకర్ ప్రసాద్‌గారి చివరి శ్రేష్ఠగ్రంథము. ఇందులో 'ఛాయావాద' తత్త్వాలు స్పష్టముగా గోచరిస్తాయి. వస్తుగత మరియు శైలిగత. అతని భావన, కల్పన శక్తి మరియు కళానైపుణ్యమునకు నిలయమైన కావ్యము-'కామాయనీ'. ఈ కావ్యములో 'చిత్రధారా' లాంటి మాధుర్యము, 'కానన్-కుసుమ్' లాంటి మాధుర్యము, 'ఆంసూ' కావ్యం యొక్క వేదన, మరియు 'లహర్' కావ్యము యొక్క గంభీరత్వము అన్నియు 'కామాయనీ' కావ్య కళాఖండములో సమన్వితమై యున్నవి. ఈ గ్రంథములో మానవుని సంఘర్షణ మరియు విజయము యొక్క మహాగానము గోచరించును.

ప్రసాద్‌గారు ఈ కావ్యములో సాంస్కృతిక భూమిక పైననే అనేక దార్శనిక, సాహిత్యమునకు చెందిన మరియు మానవతావాద సమస్యలతో సమన్వయ పరిచారు. 'కామాయనీ' కావ్యము దార్శనిక సిద్ధాంతాలపై 'ఐకమత్య' సిద్ధాంతాన్ని ఎలా ప్రతిపాదించారో, అది ప్రశంసనీయమైన విషయము. కవి ఇందులో ప్రాగైతిహాసిక విషయాలను తీసుకొని రూపక విధానములో వర్ణించారు.

'కామాయనీ' కావ్యము యొక్క కథావస్తువు (ఇతివృత్తము) రెండు విధములుగా యున్నవి. 1) లౌకిక, 2) ఆధ్యాత్మిక,

'కామాయనీ' లౌకిక కథ-ఆది పురుషుడైన మనువు మరియు శ్రద్ధతో సంబంధము గలది మరియు ఆధ్యాత్మిక ప్రాతిపదికపై ఈ కావ్యము యొక్క ఇతివృత్తము మానవ హృదయముయొక్క శాశ్వత తత్త్వముల వర్ణిస్తుంది. ఈ 'కామాయనీ' కావ్యము యొక్క ముఖ్యపాత్రలు-మనువు, శ్రద్ధ మరియు 'ఇడ'. మనువు యొక్క చరిత్ర ద్వారా ఆదిమానవుల స్వాభావిక బింబ విధానము కన్నులకు కట్టినట్లుగా కనిపిస్తుంది. శ్రద్ధ పాత్ర చిత్రణ ద్వారా త్యాగము, స్నేహము, దయ, సహనము మొదలగు స్త్రీజాతి గుణములచే ప్రకాశించుచున్నది. 'ఇడ' ఒక స్వార్థ పరాయణురాలు. బుద్ధివాద నడవడి గల స్త్రీ. 'కామాయనీ' కావ్యములో మానవ చైతన్య ఇతిహాసము కూడ ఇమిడియున్నది. ఇది మానవ చైతన్యమునకు మరియు మానవ నాగరికత యొక్క వికాస-విరాట. వ

ప్రపంచ సాహితీ క్షేత్రమునకు ఇది ఒక ఆభర ణము. 'కామాయనీ' కావ్యమును 'దాంతె' యొక్క 'డివాఇన్ కామెడి' గ్రంథముతో పోల్చబడినది.

మనువు మరియు శ్రద్ధ యొక్క సహ యోగముతో 'కామాయనీ' కావ్యంలో మానవ జాతి వికాసము యొక్క కథ వర్ణింపబడినది. జలప్రళ యము తరువాత మనువు హిమగిరి ఉత్తుంగ శిఖర ముపై చింతాక్రాంతవదనుడై కూర్చున్నాడు. శ్రద్ధ (కామాయని) అదే సమయాన మనువు కూర్చొని ఉన్న స్థలమునకు అరుదెంచినది. అక్కడ వారిరువు రికి సంభావణ జరిగినది. శ్రద్ధ మనువునకు తన సర్వస్వమును సమర్పిస్తు, అతనిని లోక కల్యాణ కార్యములు చేయుటకు ప్రేరేపిస్తుంది. మనువు దేవ జాతికి చెందినవాడు. కావున సహజముగా భోగ విలాస లక్షణములు అతనిలో తాండవించినవి. అప్పుడు మనువు-శ్రద్ధ కలయికచే వారి నాలుగు కండ్లు రెండైయాయి తత్ఫలితముగా ఆమె గర్భ వతి అయినది. శ్రద్ధ గర్భవతి కావడము చూచి మనువు తన కామ-క్రీడలకు ఆటంకము ఏర్పడిన దనుకొని ఒకరోజు 'శ్రద్ధ'ను వదలి అన్యప్రాంతా నికి వెళ్ళిపోయాడు అతడు చివరికి సారస్వత ప్రాంతానికి చేరుకున్నాడు. అక్కడ అతని ఆదేశపు రాణి 'ఇడ' అతనికి ఘనస్వాగతము పలుకుతుంది. మనువు సారస్వత నగరమున తన భుజ-బుద్ధి బలము చేత ఆనగరమును చక్కగా తీర్చిదిద్ది వైజ్ఞానిక వస్తువులచేత వైభవముంతో నింపాడు. 'ఇడ' ఇట్టి రాజ్యమును మనువునకు అంకితమొనరించినది, కాని దీనితో అతడు తృప్తి చెందలేక పోయాడు. ఒకరోజు మనువు 'ఇడ'ను బలత్కరిస్తాడు. ఆమె అందులకు ఒప్పుకోదు. ఇట్టి పరిస్థితిని ఆదేశపు ప్రజలు చూచి వారు మనువుపై సమరము సాగించారు. ఆయుద్ధములో మనువునకు గాయములైనవి-మూర్ఛితుడైయాడు.

శ్రద్ధ వేరొకవైపు స్వప్నములో మనువు యొక్క ప్రమాద పరిస్థితిని తెలుసుకొన్నది, వెంటనే ఆమె మనువును కలిసేందులకు గాను తన కుమారుడగు "మానవుని" వెంటబెట్టుకొని అతని అన్వేషణలో బయలుదేరినది. ఆమె తిరిగి-తిరిగి సారస్వత ప్రదేశానికి వెళ్లి అక్కడ మనువును కాంచినది మరియు అతనికి అవసరమగు పరిచర్య లన్నిటిని కావించినది. మనువు కొంత సేపటికి మేల్కొని 'శ్రద్ధ'ను తిలకించాడు శ్రద్ధ యొక్క త్యాగము, ప్రేమ, దయ, సహనము, విశాల హృదయాన్ని అర్థము చేసుకొని, అతడు సిగ్గుచేత ఆమెకు ముఖము చూపించ కూడ దనుకొని శ్రద్ధకు, తెలుప కుండగానే అక్కడినుండి అన్య ప్రాంతానికి వెళ్ళిపోయాడు, 'మనువు' యొక్క ఈ కృత్యము వలన 'ఇడ' కూడ చాల బాధపడినది. 'ఇడ'-'శ్రద్ధ' యొక్క పుత్రుడు మానవుని తనవద్ద ఉంచమని కోరినది. ఆమె కోరిక మేరకు శ్రద్ధ తన తనయుడు, 'మానవుని' ఆమెకు ఒప్పగిస్తు లోక కళ్యాణమునకు తోడ్పడవలెనని ఉపదేశించినది, ఆ తరువాత ఆమె 'మనువు' అన్వేషణ కొరకుగాను బయలు దేరినది. ఆమె మనువును ఒక లోయలో చూచినది, 'మనువు' శ్రద్ధయొక్క భావాలతో ఏకీభవిస్తాడు. ఆమె అతనికి ప్రపంచము యొక్క వివిధ మనోహర దృశ్యము లను చూపులకు కైలాసపర్వతము వద్దకు తీసుక వెళ్ళినది. అక్కడ మనువుకు 'ఏకాత్మ' భావము జనించినది. అతడు అక్కడ శివునియొక్క అద్భుత నృత్యము తిలకించి పరవశుడైయ్యాడు.

ప్రసాద్‌గారు 'మనువు' 'శ్రద్ధ' మరియు 'ఇడ' ద్వార మానవ మనస్సు క్రమ-వికాసము యొక్క మనో విజ్ఞాన చరిత్ర వర్ణించారు. 'కామా' యనీ' గ్రంథ పాత్రలు ఉపనిషత్తులలో, పురాణ ములలో అక్కడక్కడ పడిఉన్న కథా ప్రసంగ

ముందు సమీక్షిస్తు వాటి ఆధారముతో చక్కని కథా వస్తువునకు రూపకల్పన చేస్తు, ఇట్టి కావ్యము నకు 'కామాయనీ'యను నామకరణ మిచ్చారు. ఈ కావ్య ఇతివృత్తములో ఇతిహాసముతోపాటు రూపక విధాన మిమిడియున్నది. 'మనువు', 'శ్రద్ధ', 'ఇడ' మొదలగు పాత్రధారులు ఇతిహాసానికి చెందిన వారై నప్పటికిని వారి ద్వార సాంకేతిక అర్థము లస్తుభించి, మనువు మననశీలుడు, సంకల్పము, వికల్పము లతో కూడిన ప్రబుద్ధుడు.

మనువు మనస్సునకు ప్రతీకము ప్రపంచ మండలి మానవులందరి మనస్సులలో ఏదో ఒక చింత నిండియున్నది, ఈ చింతకు ధనవంతుడు-బీదవాడను తారతమ్యము ఉండదు. దాని దృష్టిలో అందరు సమానులే చింత నుంచీ విముక్తి నొందు టకు 'ఆశ' ఉద్భవము అత్యవసరము, తరువాత 'శ్రద్ధ' జీవితములో అడుగిడుతుంది. 'శ్రద్ధ' భావము 'కామ' భావమును ఉదయింపజేస్తుంది. మానవుని మనస్సులో 'కామం' అనంతరము 'లజ్జ' (సిగ్గు, బిడియము) ప్రవేశిస్తుంది. ఇట్టి దశలో కార్యానికి ప్రాధాన్యం ఉంటుంది. 'కామాయనీ' కారణముతో 'ఈర్ష' జనిస్తుంది. ఇట్టి భావము మానవునకు నష్టము కలుగజేస్తుంది. దీని వలన 'అహం' లేక అహంకారము పెరుగుతుంది. అప్పుడు మానవుడుబుద్ధి శరణ్యాన్ని కోరుకుంటాడు.మనువు భౌతిక వస్తువులపై మమకారము పెంచుకుంటాడు. కాని బుద్ధి మరియు భౌతికత్వము మధ్యకలహము పెరుగుతుంది. అందుచేత మనువు (మనస్సు) శ్రద్ధ (హృదయము) ఎదుట పరాజితుడౌతాడు. సారస్వత ప్రదేశము నుండి అన్య ప్రదేశానికి పారిపోతాడు. అయినప్పటికిని 'శ్రద్ధ' అతనిని వదలిపెట్టకుండ అతనిని పట్టుకొని అతనిని సన్మార్గములో నడిపిస్తు అతనికి ఆనందం కలుగజేస్తుంది.

అప్పుడు మనువునకు 'నిర్వేద' భావము కలిగినది. తత్ఫలితముగా అతడు వైరాగ్య చెందుతాడు. మనువు అనంతరము 'ఇచ్ఛ' జ్ఞాన మరియు క్రియ లను వదలి 'శ్రద్ధ' నడిపిన మార్గములోనే నడువ సాగినాడు, ఆ మార్గము చేతనే అతని జీవితము ఆనందమయమైనది.

ఈ విధముగా మనువు చింతను పరిత్యాగము చేసి 'శ్రద్ధ' 'కామ', 'వాసన', 'కర్మ', 'లజ్జ', 'ఈర్ష', 'ఇడ', 'స్వప్న', 'సంఘర్ష' మరియు 'రహస్య' అనుభూతుల ద్వార ఆనందము పొంద సాగినాడు.

'కామాయనీ' కావ్య కథాఖండములో పదు నైదు సర్గములు గలవు. ప్రతి సర్గము యొక్క నామాంకరణ మనోవికార సంబంధిత భావము చేపెట్ట బడినది.

'కామాయనీ' కావ్యము యొక్క ఇతివృత్తము మరియు ఇతిహాసము భూమిక (పీఠిక)పై ఆధారపడి యున్నది. ప్రసాద్‌గారు ఈ కావ్యమునకు సాహిత్య రూపమొసంగుటకుగాను సాహిత్యము మరియు కల్పనా శక్తి నుపయోగించారు. ఇట్టి గ్రంథములో ఇతిహాసము మరియు కల్పను రెండూను మణి-కంచనము-వోలే ఇమిడి ఉన్నవి. 'కామాయనీ' కావ్య బీజాలు 'అథ్వరణము'లో మరియు 'శతపథబ్రహ్మణ'కునిలో కూడ కనిపి స్తాయి.

పురాణ గ్రంథములలో బ్రహ్మదేవునికి 14 పుత్రులున్నారని వర్ణింపబడినది. అట్టి బ్రహ్మ దేవుని కుమారులే మనువులు, అందులో వారిలో 'కామాయని' కావ్య అనగా మానవజాతి ఆది పురు షుడు మనువు ఒకరు అని ధృవీకరించబడినది. కాని 'కామాయనీ' వైవస్తు మనువునకు సంబంధిం

చిన వివరణ శతపథ- బ్రాహ్మణ గ్రంథమందు గలదు. శ్రీ తారక్ నాథ్ బాలి గారు కామాయనీ కావ్య విషయములో ఇలా అన్నారు కామాయనీ ప్రధాన రూపములో మానవ చరిత్రకు సంబంధిత కథా కావ్యము, ఇందులో అక్కడక్కడ సాంకేతిక అర్థము వ్యక్తమగుచున్నది, ప్రసాద్‌గారు స్వయం 'కామాయనీ' విషయములో ఇలా అన్నారు- 'మానవుని యొక్క మనోవైజ్ఞానిక ఇతిహాసము కామాయనీ

కామాయనీ మరియు విశ్వంభర కూడ ఇతిహాసమునకు మరియు కల్పనా విధానమునకు సంబంధించిన మహాకావ్యాలు, ఆది దంపతుల ఇతిహాసముతో పాటు, మానవజాతి వికాసము యొక్క మనోహర వర్ణనలిందు గలవు,

ఉదా:-

అలా కలసుకున్న ఆదిమిథునం
అంత రంగములో ఒక స్మృతి విహంగం,
విశ్వంభర ; పుట ; 6,

అటు కొన్ని చెట్లు
అమృతాన్ని ఫలాలుగా మలచి ఆహ్వానిస్తూ,
ఇటు ఒకే-ఒక చెట్టు
ఎప్పుడూ తన పండును తాకరాదని
అనుశాసిస్తూ,
విశ్వంభర : పుట : 7

'కామాయనీ' కావ్యాంతమున ఈక్రింది పద్యమును పరిశీలింపుడు.

సమరస్ థే జడ్ యా చేతన్
సుందర్ సాకార్ బనా థా
చేతనతా ఏక్ విలసితీ
ఆనంద్ అఖండ్ బనా థా.

ఇట్టి పద్యాంశముద్వార ప్రసాద్‌గారి గొప్ప అనుభూతిశక్తి అభివ్యక్త మగుచున్నది. ఈ అనుభూతి శక్తి ప్రపంచమందలి మానవులను 'వసుదైవ కుటుంబకం'గా మార్చటానికి ఎంతగానో సహకరిస్తు ఐకమత్యమును భ్రాతృత్వాన్ని పెంపొందిస్తు కలసి ఉండే కలదు సుఖం, ఐకమత్యమే మహాబలం' యన్నట్లుగా ఉన్నవి మరియు అబ్రహమ్ లింకన్‌గారి మాటలను జ్ఞాపకమునకు తెస్తాయి. **United we stand and divided we fall** మరియు స్వర్గీయ భారత ప్రధాన మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ఐకమత్యము యొక్క మహాత్మము గూర్చి ఇలా అన్నారు-ఏక్‌తా హమారీ జిందగీ హై ఔర్ ఫూట్ హమారీ మౌత్ హై, కవి ప్రపంచ మానవులలో మరియు జడ వస్తువులలో కూడ సామరస్య విధానాన్ని ప్రదర్శించారు. మన భారత రాజ్యాంగములో కూడ ఈ సామరస్య తత్వమునకు అధిక ప్రాధాన్య మొసంగ బడినది, అంతే కాకుండ మన భారత దేశవు నేటి పరిస్థితులకు సామరస్య విధానమే అత్యవసరము. ఇట్టి సామరస్య విధానము వల్లే భారతజాతి మూడు పూలు ఆరుకాయల రూపము దాల్చగలదు-'సర్వే జనాః సుఖినో భవంతు,'

'కామాయనీ' సందేశము విధంగానే 'విశ్వంభర' సమగ్ర వచన కావ్యమందు కూడ యుగ నిర్మాణానికి లేక మూలతత్వమునకు చెందిన ఉదాహరణలను ఆలోకించవచ్చును :-

| | |
|---|---|
| ఋషిత్వానికీ | పశుత్వానికీ |
| సంస్కృతికీ | దుష్కృతికీ |
| స్వచ్ఛందతకూ | నిర్బంధతకూ |
| సమార్ద్రతకూ | రౌద్రతకూ |
| తొలిబీజం | మనస్సు |
| తుదిరూపం | మనస్సు |
| మనస్సుకు | తొడుగు మనిషి |

మనిషికే ఉడుపు జగతి.
ఇదే విశ్వంభరా తత్వం
అదే అనంత జీవిత సత్యం.

విశ్వంభర : పుట : 100.

శ్రీ నారాయణరెడ్డిగారు కావ్యాంతములో సామరస్య అనుభూతి శక్తిని ప్రకటించారు. ప్రసాద్‌గారి యొక్క అనుభూతి జడ మరియు చేతన సంబంధమైనది. డా॥ సి. నారాయణరెడ్డిగారి 'విశ్వంభర' కావ్యములో బుషిత్వానికి-పశుత్వానికి మరియు పై కవితలలో ఉదహరించిన ద్వంద్వము లను సంబంధించిన సమరసత అభివ్యక్త మగు చున్నది-

ఉషా సున్‌హలే తీరు బర్‌సాతీ
జయ్ లక్ష్మీ సీ ఉదిత్ హుఈ
ఉధర్ పరాజిత్ కాల్ రాత్రి భీ
జల్ మే అంతర్నిహిత్ హుఈ.

కామాయనీ యొక్క ద్వితీయ సర్గ 'ఆశ' కవితలో మానవుని 'ఆశ' తన తన రెక్క లను విదిలించుచున్నది. అదే విధముగా విశ్వంభర ద్వీతీయ సర్గారంభములో మానవుడు ప్రభాతము యొక్క సుప్రభాతము గానము చేయుచున్నాడు,

ఉదా:-

మనిషి మనస్సులో ఒక ప్రభాతం
మౌనాన్ని పెకల్చుకొని
ఊర్ధ్వంగా ఎగిసే
ఉన్మత్త నాదజలపాతం.

విశ్వంభర : పుట 20

'కామాయనీ' కావ్య ఇతివృత్తాన్ని ముఖ్యము గా 4 భాగములుగా విభజింప వచ్చును, ఎట్లన:-

(అ) జల ప్రళయము,

(ఆ) శ్రద్ధ ప్రణయమునుండి ఆమెను పరిత్యాగ మొనర్చు వరకు,

(ఇ) 'మనువు'చే ఇడ కలయిక మరియు సారస్వత ప్రదేశములో విప్లవము,

(ఈ) శివతాండవ నృత్యము మనువు తిలకించి అఖండ ఆనందము పొందు వరకు,

విశ్వంభర సమగ్ర వచన కావ్యము యొక్క కథ వికాసమును ఐదు భాగములు విభజింపవచ్చును

(అ) విశ్వంభర-ప్రభావాత్మక రూపము
(ఆది దంపతుల ప్రేమానురాగం)

(ఆ) సాంస్కృతిక వికాసము

(ఇ) వైజ్ఞానిక వికాసము,

(ఈ) ఆధ్యాత్మిక వికాసము,

(ఉ) విశ్వంభరతత్త్వము

ఈ రెండు కావ్యాలలో మానవుని వివిధ మానసిక మనోవృత్తులను మనో వైజ్ఞానికముగా వర్ణింపబడినవి. కామాయనీ కావ్యములో మానవుడు ప్రత్యభిజ్ఞ దర్శనమునకు సంబంధిత సామరస్య సిద్ధాంతమును ప్రతిపాదించారు, దీని మూల ప్రతి పాద్య విషయము ఆనందము. ప్రసాద్‌గారు ఉపని షత్తులు శైవాగము, బౌద్ధదర్శనము మరియు శృతులనుండి మరియు వేదముల నుండి ఉపయోగ కరమైన దార్శనిక తత్వములను సమీకరించుకొని వీటితో కామాయనీ కావ్య నిర్మాణం చేశారు.

డా॥ సి. నారాయణ రెడ్డిగారు విశ్వంభర కావ్యము యొక్క నాల్గవ సర్గలో వివిధ దార్శనిక తత్వాలను కావ్యాను గుణంగా విశదీకరించారు.

ఉదా ;-

ఎంతబాగా మెరుగు పెట్టాను

ఈ పసిడి పంజరాని కీ?
ఎన్ని ముత్యాలగింజలు తినిపించాను
ఈ ప్రాణ విహంగానికి,

(విశ్వంభర -పుట : 63)

కామాయనీ మరియు విశ్వంభర కావ్యములలో బింబ విధానము అద్వితీయముగా గోచరించును, విమర్శకులు విధానాన్ని నాలుగు రకములుగా విభజించారు.

1. ఇంద్రియ బింబము,
2. వస్తు సంబంధిత బింబము,
3. భావ-బింబము
4. దార్శనిక బింబము.

ఈ నాలుగు రకముల బింబములకు శాఖలు ప్రశాఖలు గలవు ప్రసాద్‌గారి కామాయనీ కావ్యములో ఇంద్రియ-బింబమునకు సంబంధిత ఉదాహరణలను తిలకించ వచ్చును-

తరుణ్ తపస్వీ సా కహా బైఠా
సాధన్ కర్తా సుర్ స్మశాన్
నీచే ప్రళయ సింధూ లహరోంకా
హోతాథా సకరుణ్ అవసాన్,

(కామాయనీ : చింత పుట 15)

డా॥ సి నారాయణరెడ్డిగారి సమగ్ర వచన కావ్యము విశ్వంభర కావ్యమందు ఇంద్రియ-బింబములను కాంచవచ్చును. ఉదా:-

అప్పుడు తెలిసింది,
గుడ్డి చీకటికీ ఆకాశమునిండా
కోటి కళ్ళుంటాయని,
సూర్య చంద్రుల్ని చప్పరించి వదిలివేసే
సూక్ష్మ శక్తు లుంటాయని.

ఈ రెండు కావ్యముల తులనాత్మక-మార్గదర్శక నియమాలను పరిశీలించిన తరువాత స్పష్టమగు విషయము ఏమనగా కామాయనీ మరియు విశ్వంభర ఒక నిర్దిష్ట దర్శనము మరియు ఆధ్యాత్మిక భూమికపైన లిఖింపబడిన మనోవిజ్ఞానానికి సంబంధిత మహాకావ్యములని చెప్పవచ్చును.

విక్రంనివాస్, 18/ 3RT.
బాల సముద్రం క్వార్టర్సు
హన్మకొండ-506001
వరంగల్లు.

తెలియజెప్పేవాడు గురువు, తెలియజేసేది దైవం

హిందీ కథ :

# అయ్యగారి నుయ్యి

మూలం :
ప్రేమ్‌చంద్

తెలుగుసేత :
కాలిపు వీరభద్రుడు

జోఖూ లోటా నోటి దగ్గరికి తెచ్చేడు నీరు కంపు కొడుతూంది, గంగితో అన్నాడు-' నీళ్ళు కంపు కొడుతున్నాయే గంగీ, గొంతెండి పోతూంటే తాగాలను కున్నాను.'

గంగి ప్రతిరోజూ సాయంకాలం నీళ్ళు తెస్తుంది. నుయ్యి దూరం.మాటికీ వెళ్ళాలంటే కష్టం నిన్న తెచ్చినప్పుడు బాగానే వున్నాయి. ఇప్పుడా నీళ్ళు కంపు కొడుతాన్నా యెంచేతనో. తనూ చూసింది నిజమే కంపు కొడుతున్నాయి. నూతిలో ఏదో చచ్చి వుంటుంది. మరోచోట మంచినీళ్ళు తెద్దామన్నా ఎక్కడున్నాయి?

జమిందారుగారి నుయ్యివుంది. అయ్య బాబోయ్ ఇంకేమన్నావుందా. అయ్యగారి నుయ్యి దగ్గరకి వెళ్ళడమే దూరం నుంచే తరిమి కొట్టేస్తారు. షావుకారు నుయ్యి వుందంటే అది వూరికి చాలా దూరం. అయినా ఆనూతినుంచీ నీళ్ళు తేనివ్వరు. మరోనుయ్యి యీవూరికి లేదు.

జోఖూకి మూడు నాలుగు రోజుల్నుంచి జ్వరం ఎంతో సేపట్నుంచి దాహం వేస్తుంది. ఇంక ఉండలేక పోయాడు-'నావశం కాదింక. ఈదాహాన్ని తట్టుకోలేను ముక్కు మూసుకొని ఓ గుక్కెడు తాగేస్తాను.' జోఖూ అన్నాడు.

గంగి నీళ్ళివ్వలేదు. చెడునీరు తాగితే రోగాలొస్తా యని గంగికి తెలుసు. కాని ఆనీటిని కాచి వడకట్టాక తాగ వచ్చునని ఆమెకి తెలీదు. ఏది చచ్చిందో నీళ్ళు కంపుకొడుతున్నాయి. మరోచోట తెస్తానుండు. గంగి అంది.

ఏంటీ మరో చోటా!! అయ్యగారి నూతిలో గాని షావుకారు నూతిలో గాని లోటా ముంచనిస్తారా? జోఖూ అన్నాడు కాళ్ళు చేతులూ విరిచేస్తారే అక్కడికెళ్తే. బాపనయ్య తిట్లతో దీవిస్తాడు, అయ్యగారు బెత్తాంతో వడ్డిస్తాడు. షావుకారుది రూపాయి దగ్గర అయిదు గుంజే గుణము.

మనలాంటి పేదోళ్ళని చూసే దెవరే? మనం చస్తే వూరవతలికి పారెయ్యడం మాట అటుంచు కనీసం తొంగి చూడమన్నా చూడరే మన శవాల వైపూ, మన వైపూను. అలాంటోళ్ళు నూతినీళ్ళు యిస్తారటే నీపిచ్చిగాని ఈ మాటల్లో పచ్చినిజం వుంది, గంగి సమాధానమూ యివ్వలేదు నీళ్ళు యివ్వలేదు.

రాత్రి తొమ్మిదయింది. పగలంతా రెక్కలు ముక్కలయేటట్టు కష్టి పడిన ఆ కూలి ప్రజలు ఎప్పుడో నిద్రపోయారు. అయ్యగారి గదపలో యింకా జనాలున్నారు, రాజుల్తో యిప్పుడెలాగు

యుద్ధాలు లేవు. అంచేత కోర్టు వ్యవహారాలు మాట్లాడుకుంటున్నారు.

పోలీసు యినస్పెక్టర్ని ఎలా లొంగదీసు కున్నదీ అయ్యగారు వర్ణించి చెబుతున్నారు. తనకు కావలసిన కోర్టు కాగితాల్ని మోసంతో ఎలా సంపాదించారో చెబుతున్నారు. సరిగ్గా అదే సమయంలో గంగి అక్కడికి మంచినీళ్ళ కోస మని వచ్చింది. దీపం వెలుతురు అయ్యగారి చావిడిలోంచి నూతి వరకూ వస్తూంది. నుయ్యి చాటున గట్టుమీద గంగి కూర్చుంది. సమయం కోసం ఎదురు చూస్తూంది,

ఆ నూతి నీరు గ్రామస్థులంతా తాగుతారు. తామే తాగకూడదు-ఎప్లవాత్మకమైన గంగి మనసు కట్టుబాట్లమీద, దయనీయమైన తప్పని సరి పరి స్థితులమీద తిరుగుబాటు ప్రారంభించింది.

మేమెందుకు తక్కువ వాళ్ళమయ్యాం? వాళ్ళెందుకు గొప్పవాళ్ళయ్యారు? ఈ గొప్పవా ళ్ళంతా ఒకర్నొకరు మించిన మోసగాళ్ళు. దొంగ తనాలు చేస్తారు. మాయలు మోసాలు చేస్తారు. అబద్ధాలాడి కేసులు గెలుస్తారు జమిందారు గారు- ఈ అయ్యగారు- అవాళ ఏం జేసారు? అ గొల్లాడి గొర్రెని దొంగలెంచారు. ఆతర్వాత దాన్ని తినే సారు. ఆ సావుకారు మాత్రం తక్కువవాడా? నెయ్యిలో నూనె కల్తీచేసి అమ్ముతాడు నెయ్యనే ఏమిటి? అన్నీ కల్తీవే అమ్ముతాడు. మాలాంటి వాళ్ళకి కూలి డబ్బు లివ్వడానికి ప్రాణాలు పోతు న్నట్టు బాధ పడతాడు ఇలాంటి వీళ్ళు మాకంటె ఎందులో గొప్పవాళ్ళు మేం పెద్దవాళ్ళమని వాళ్ళను కోవడమే తప్పు? మేం గొప్పవాళ్ళమో అని వాళ్ళ లాగ మేం చాటుకు తిరగం. నేనలా వూళ్ళో కెళితే నన్నంతా తినేసేటట్టు చూస్తారు. వాళ్ళ ఆడవాళ్ళు నాఅంత అందంగా లేరని లోలోపల కుళ్ళుతారు. అలాంటి పెద్దవాళ్ళకి మేమే గొప్ప వాళ్ళం అనే గర్వమొకటి పైగా!

నూతిపైపు ఎవరో వస్తున్నట్లు అలికిడి అయింది. గంగి గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి తనని ఎవరు చూసినా చాలా ప్రమాదం. ఒక్క దెబ్బ కూడా పైకి పోదు. చేద తాడు, కుండ పట్టుకొని ఎవ్వరికీ కనిపించకుండా వంగొని నడుస్తూ చెట్ల చాటుకి వెళ్ళి నిలబడింది గంగి.

వీళ్ళు కెప్పుడన్నా ఎవరిమీదనన్నా దయనేది కలుగుతుందా అని పాపం, ఆ మంగులుగాడ్ని రక్తం కక్కుకునేటట్టు కొట్టారు వెట్టిచాకిరీ చెయ్యక పోవడమే వాడు చేసిన నేరం. పైగా వీళ్ళేమో గొప్పవాళ్ళట గొప్పవాళ్ళు!

ఇద్దరాడవాళ్ళు నీళ్ళకోసం నూతి దగ్గరి కొచ్చారు. వాళ్ళ మాటలు గంగికి వినిపిస్తున్నాయి.

'భోజనాని కొచ్చారా, మంచి నీళ్ళు పట్రా అని ఆజ్ఞ యిచ్చారు ఆయనగారు, చేద కొనాలంటే డబ్బుల్లేవు'

'మనం ఒక్క క్షణం కూర్చుంటే చాలు యీ మగాళ్ళన్నారే కళ్ళు కుట్టుకుంటారు'

'పోనీ. ఓ కావడి నీళ్ళన్నా తెస్తారా అంటే వాళ్ళొంగదు. ఈ పని చెయ్, ఆపని చెయ్ లని అజమాయిషీ చెయ్యడానికి మాత్రం లోటులేదు — మనమేదో రంకు పెళ్ళాల మన్నట్టు '

'కాకపోతే యింకేమిటనుకుంటున్నావ్. ఇంత తింటున్నావా, బట్టలిస్తున్నారా, అతని జేబులోదో వెచ్చాల్లో మిగిల్చో అయిదో పదో నెలకి తీసుకుంటు న్నావా? మరింక రంకుపెళ్ళా లెలా వుంటారేంటి?'

'ఈ పచ్చిన పాముని యింకెందుకు పోనిస్తా వస్తా? ఇప్పుడే స్నానంలో వస్తున్నాననుకో. హాయిగా ఊపిరి తీసుకోవాలన్నా తీరిక లేకుండా వుంది. నన్నింతో బాగా చూసుకుంటున్నట్టు తెచ్చి కబుర్లు! గొడ్డు చాకిరీ చేస్తూ చేస్తూ ఎవరికి చెప్పినా ఎవరూ పట్టించుకోరు.'

నీళ్ళు తోడుకొని యిద్దరూ వెళ్ళిపోయారు. జమీందారు కూడా తలుపులు మూసి లోనికి వెళ్ళిపోయారు. గంగి నిర్భయంగా ఊపిరి పీల్చుకుంది. మరింక ఏ ఆటంకమూ లేదు. సప్త సముద్రాలవతల చెట్టు తొర్రలోని చిలకని తేవానికి వెళ్ళిన రాజకుమారుడు కూడా యింత జాగ్రత్తనీ తెలివితేటల్నీ ప్రదర్శించి వుండడు, అడుగుల శబ్దం కూడా వినిపించనివ్వకుండా మెల్లగా పిల్లిలాగ గంగి నుయ్యి చేరుకుంది. ఎంతో ఘనకార్యం సాధించినట్టుగా ఆనందపడిపోతుంది.

ఎవరన్నా ఉన్నారేమోనని నాలుగు పక్కలా పరిశీలించి చూసింది గంగి ఇప్పుడు గాని దొరికి పోయిందా [illegible]. అందుకే దేవుళ్ళందరికీ మొక్కుకొని గుండె నిబ్బరపరచు కొని నూతిలోకి నెమ్మదిగా దిగవేసింది. రెండు మూడు సార్లు తాడు లాగింది. మరొక్కసారితో చేద నూతి పైకి వస్తూంది. చేదని చేత్తో అందుకో దానికి నూతిలోకి వంగింది గంగి. సరిగ్గా ఇంతలోనే ఏ పనిమీదో జమీందారు తలుపు తెరిచాడు. సింహం నోరు కూడా అంత భయంకరంగా వుండదేమో-గంగి అనుకొంది. అంతే, గంగి చేతిలోంచి తాడు జారి చేద దబ్బున నూతిలో పడిపోయింది. నీళ్ళలోంచి శబ్దం వస్తూనే వుంది.

'ఎవర్రా నూతి దగ్గర?' కేకవేస్తూ అయ్యగారు నూతివైపు వస్తున్నారు. గంగి నూతిగట్టు మీంచి ఒక్కదూకువేసి పరుగు ఎత్తుకుంది.

ఇంటి కొచ్చిన గంగి లోటాతో కంపు నీళ్ళు తాగుతూన్న జోఖూని చూసింది.

హిందీ లెక్చరర్
శివాపురం స్ట్రీట్
నరసీపట్నం 531 116
విశాఖ జిల్లా

ఉపదేశమంటే దైవసన్నిధిని చేర్చటం

# సాహిత్యం- దాని విలువలు

— పోచు అశోకు

సృష్టిలో సర్వేసర్వత్ర భాష పుట్టగానే సాహిత్యము పుట్టినది. సర్వమానవ జాతికి అంతరంగికమైనది, సార్వజనీనమైనది, సర్వోప భోగ్యము అయినది సాహిత్యము. సాహిత్య సృష్టి సహృదయ హృదయ గమ్యముగ ఒక సహృదయుని స్పందనా శీలమైన హృదయము నుండి బహిర్గిల్లును.

చీకట్లో ఉన్న జిజ్ఞాసికి, అన్వేషికి వెలుగు దృష్యం గోచరించుట సహజం. సమాజాన్ని చీకటితో పోల్చుకుంటే సాహిత్యం ఆ చీకట్లో నిలబడ్డ వ్యక్తిత్వం. అదెప్పుడు వెలుగునే ఆశిస్తుంది ఆకాంక్షిస్తుంది. అలా వ్యక్తిత్వంతో జీవించి, జీవిస్తూ, జీవించబోయే సాహిత్యంలో ఎన్నెన్నో ఇందుకొన్న వేకువ కుసుమాలైతే ఇంకొన్ని ప్రభాత కిరణాలు.

**Literature is the criticism of life**

—అర్నాల్డు

**Literature is an expression of Society**

-డిబొనాల్డు

సాహిత్య గ్రంథాలను తీసుకొని పై నిర్వచనాలను అన్వయింపజేసి యువలక్షణసమన్వయం చేసుకొని పరిశీలిస్తే అందులో అనాటి రకరకాల మనుషుల మనస్తత్వములు, జీవితాలు అర్థవంతమైన భావచిత్రాలెన్నో కనిపిస్తాయి. ఈ సమకాలీన ప్రాతినిధ్య లక్షణం ఉండబట్టే సాహిత్యాన్ని సామాజిక దృష్టితో విశ్లేషించి సమీక్షించడం అవసరము.

సాహిత్య సమీక్ష అనునది నిర్దిష్టమైన దృక్పథంగల సామాజిక తత్వదారశనికుల వలన ప్రచారంలోకి వస్తుంది.

**Literature is really not a reflection of Social process but the essence, the abridgement and summary of history.**
అని అన్నారు.

సాహిత్యానికి జీవితంతో ప్రమేయం ఉంది. కాని అది అనుకరణ కాదు. ప్రపంచానికి ప్రతిబింబమూ కాదు. మానవుడు చావు పుట్టుకల మధ్య నిర్విరామంగా పరిశ్రమిస్తాడు. అయితే సాహిత్యంలో మానవుడు సాధారణమైన అనుభూతుల కెలా ప్రతిస్పందన పొందుతాడన్నది. ఈ అనుభూతులకు, సామాజిక జీవితానికి గల సంబంధం ఉండనే ఉంటుంది. ఈ పూర్ణ మానవుని చిత్రించడం ఉదాత్త సాహిత్యం యొక్క లక్ష్యం.

తెలుగు సాహిత్యానికో విశిష్టతనూ, గుర్తింపును ఇచ్చి తెలుగు.రచనలను అంతర్జాతీయస్థాయికి తీసుకవెళ్ళిన నిన్నటి తరం రచయితల రచనలు నేటి సాహిత్యంలో ఉద్భవించడం లేవు.

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, (రాజశేఖర్ చరిత్ర) గురుజాడ వారు (కన్యాశుల్కం) సాంఘిక దురాచారాలపై యుద్ధం ప్రకటించారు. చలం రచనలలో (బ్రహ్మణీనెం. జీవితాదర్శం,

ప్రేమ లేఖలు, అమీనా etc) స్త్రీకి జరుగుతున్న అన్యాయాలపై ధ్వజమెత్తాడు. పురుషాధిక్యత గల సమాజంచేత స్త్రీ ఏ విధంగా వంచించ బడుతుందో ఉద్ఘాటిస్తూ ఆమెను తిరుగుబాటు చేయమంటాడు. విశ్వనాథ, (వేయిపడగలు) ప్రాచీన భారతీయ సంస్కృతిని ప్రతిష్ఠాపనం చేశాడు. శ్రీశ్రీ అభ్యుదయ రచనలు (మహాప్రస్థానం, ఖడ్గసృష్టి etc). చేసి జాతిని జాగృతం చేశాడు. అదే విధంగా దాశరథి (రుద్రవీణ, అగ్నిధార), డా॥ సి. నారాయణరెడ్డి (విశ్వంభర, etc) ('విశ్వంభర'కు జాతీయ జ్ఞానపీఠ్ అవార్డు లభించింది). మొదలగు వారు తమ రచనల ద్వారా మంచి పరపతిని సంపాదించారు. వారి ద్వారా రచనలు పాపులర్ వహించినవి.

అదేవిధంగా బుచ్చిబాబు (చివరకు మిగిలేది) గోపీచంద్ (అసమర్థుని జీవితయాత్ర); ఉన్నవ లక్ష్మీ నారాయణ (మాలపల్లి); నవలలు నిత్య నూతనమైనవి. దానికి కారణం సమకాలీన జీవితంలోని సంక్లిష్ట సామాజిక పరిస్థితులను అద్దం పట్టించేవిగా ఉండడమే.

వారందరు వారికిగల సామాజిక దృక్పథం వారి అనేక రచనలలో విశదమైనది. వారందరు అనేక రకాల సమకాలీన సాంఘిక వ్యవస్థల స్వరూపాన్ని తమ సాహిత్యంలో ప్రతిష్టించారు.

స్త్రీ పునర్వివాహము, కన్యాశుల్కం, పాశ్చాత్య నాగరికతా వ్యామోహ నిరసన ప్రాచీన భారతీయ సంస్కృతి ప్రతిష్టాపనం స్త్రీ స్వాతంత్ర్యం, సామ్యవాదం, కమ్యూనిజం, గతితార్మిక భౌతిక వాదాలు మొదలైన సామాజిక విషయాలెన్నో వారి రచనలలో చోటు చేసుకున్నాయి. కాబట్టే వారి ఆయా రచనలు నేటికి గూడ మంచి పాపులర్ గాంచినవి. సాహిత్యాభిరుచి గల హృదయాలలో ప్రముఖ స్థానంను అలంకరించినవి.

ఈ తరం రచయితలలో పువ్వులు ఏరడం తెలుసుగాని విభిన్నరీతులలో అల్లే నేర్పు వారికి తెలియదు. వారి రచనలను పరిశీలిస్తే-పాఠకులు పంచరంగుల రంగుల పుష్పాలనే గమనిస్తున్నారు కాని దండ అల్లకంపట్ల గల నేర్పును గమనించటం లేదు. ఇక్కడ రంగుల పుష్పాలంటే శృంగారం, సస్పెన్స్, భీభత్సం లాంటివి. నేర్పు అనగా రచన యందలి భావం, సమగ్రత, ఇతివృత్తం వాటిని పాఠకులు అర్థం చేసుకోలేక పోతున్నారు

పాఠక లోకానికి నేటి సాహిత్యం ఒక క్రమ పద్ధతిలో శృంగారం, సస్పెన్స్, హింస, భీభత్సాదులను సిరంజిలో ఎక్కించి వాటిని పాఠకలోకములో ప్రయోగించి వాటికి క్రమేణ బానిసలుగా జేసి అవి పాఠకులు ఇష్టపడుతున్నారు. మేము పాఠకులు ఇష్టపడేటట్లు రచనలు చేస్తున్నాము అని వ్యాపార దృష్టితో రచనలు చేస్తున్నాము. ప్రచురణ కర్తలు వారిని ప్రేరేపిస్తున్నారు. రచయితలు వ్యాపార దృష్టితో రచనలు చేస్తున్నారు.

పాఠకుడు పఠనం ద్వారా సమస్యకు పరిష్కారం వెదక లేకపోవచ్చు. కనీసం ఆలోచించేలా చేయడం రచయిత క

నేడు ఉదయిస్తున్న సాహిత్యం కాలక్షేపానికి పల్లీ బఠానీలా ఉపయోగపడుతున్నాయేగాని పాఠకునిలో ప్రతిస్పందనలు కలగడం లేదు. ఒక డిటెక్టివ్ నవల, ఇతరత్ర నవలలను చదివిన పాఠకుడు మొదట చదివిన ఉత్సుకతను తరువాత చదువుతో పొందలేకపోవుచున్నాడు. ఆ నవల దేనికి పనికి రాకుండా పోవుచున్నది.

ఇక్కడ ఒకటి ఆలోచించాలి. నేటి ప్రజా జీవనం యాంత్రికంగా ఉంది. కాబట్టి చదివిన దాన్ని గుర్తుంచుకోవడం, దాని ఉపయోగాన్ని, అర్థాన్ని ఆలోచించే వ్యవధి లేకపోవడం జరుగుతుంది. కాని

సాహిత్యాభిలాషులు వాటిని పట్టించుకొని నేటి సాహిత్యం ఎంత దిగజారుతున్నది అని ఆందోళన పడుతున్నారు.

వాస్తవంగా సాహిత్యం మానవ హృదయాల్లో వర్షించి కొత్త భావాల బీజాలు నాటినవిగా ఉండాలి. సాహిత్యం జాతి జీవనానికి ప్రతిబింబంగా ఉండాలి. సాహిత్యంలో మనిషి చావు పుట్టుకల గురించి వ్రాయ దంకాదు. ఈ మధ్య ఎలా జీవించాడు. ఎండమా వులు ఏవి? సేదతీర్చే చలివేంద్రాలు ఏవి? అతని అనుభూతులు ఏమిటి? మొదలగు వాటిని ప్రతిబిం బించేదిగా ఉండాలి

మనిషికి-సామాజిక పరిసరాలకు మధ్య నిరంతరం పరస్పర సంబంధం పరస్పర అవగా హన ఏ విధంగా ఉంటుందో సాహిత్యం అదే విధంగాఉండి సమాజం మనిషిని; మనిషి సమా జాన్ని ఏ విధంగా ప్రభావితం చేస్తుందో చూపెట్టే విగా ఉండాలి. జీవితానికి వికాసం కలిగించి దానిని అభ్యుదయ మార్గంలో నడిపించే రచ నలు చేయాలి.

సమకాలీన జీవితంలోని సంక్లిష్ట సామాజిక పరిస్థితులను దృష్టియందుంచుకొని రచనలు చేయ డం అవసరం. సంవిధాన పరిజ్ఞానం అవసరం. తెలుగు భాషా మార్దవాన్ని భావ ప్రకటనా విస్తృతిని పోకుండా చూడాలి. జీవన సత్యాల, జీవన తత్వాల సమ్మేళనం రచయితల కవసరం. సాహిత్య ప్రక్రియలోని దేనినైన పాఠకుడు ఆస్వాదించేటట్లు చేయడం రచయిత కర్తవ్యం. పఠనం ద్వారా మానసికానందం కలిగి అనుభూతితో విహరించాలి. అక్షరాల్లో జాలువారే అద్వితీయ రసభావ స్పంద నం ద్వారా పాఠకుడు ప్రతిస్పందించుతాడు.

ముఖ్యంగా ప్రతి రచన కూడా జాతిని జాగృ తం చేసేవిగా ఉండాలి. అనుకరణ మోజును విడనాడాలి. సాహిత్య పరమార్థాన్ని గ్రహించలేని నేటి ఆధునిక రచయితలు కొంత మంది యథాతథమైన సమాజ చిత్రణమే సాహిత్య పరమావధిగా భావించి రచనలు చేస్తున్నారు. అలా చేయక సమస్యకు పరిష్కారం లభించేవిగా ఉండాలి. సామాజిక పరంగా సాహిత్య పరంగా స్పష్టమైన తాత్విక దృక్పథం ఉండాలి

ఇతరుల ప్రేరణ వలన అనుకరణం వల్ల రచింప బడినది ఉత్తమసాహిత్యము అనిపించుకోదు. కవి తన ప్రతిభచే రచనలు చేయవలయును. గొప్ప సాహిత్య స్రష్టలు ఉత్తమ సాహిత్య స్వరూపమును గుర్తించి ఉత్తమ కవులైరి.

సాహిత్య క్షేత్రమునందు తమ రచనలను తామే విమర్శించు కొనగల నేర్పు వారికున్నచో పరి పూర్ణమైన సాహిత్య గ్రంధములను సృష్టించగలు గుదురు. సాహిత్యాభిరుచిగల పాఠకుడు ఆయా రచనల పరమార్థమును గ్రహించి వెల్లడి చేయు వరకు వారి రచనలు నిద్రాణమై యుండును. కావున రచయిత స్రష్ట, ద్రష్ట రెండు బాధ్యతలను నిర్వ ర్తించి నపుడే రచనలు ఉత్తమోత్తము లవుతాయి. అసలు 'సాహిత్యమనునది ఒక సామాజిక క్రీడ.

నవ్య సాహిత్యాభిలాషులు చేయు ప్రయోగము లందు వారి ప్రతిభా పాటవములపై, వారి అనుభవ ముల వలన సిద్ధించిన జ్ఞానము మీదనూ నూతన ప్రక్రియలు ఆవిర్భవిస్తాయి.

ముఖ్యంగా చెప్పొచ్చేదేమిటంటే: రచయిత తాను ఒక రచనను చేయ సంకల్పించినపుడు రచన ఎందుకు చేస్తున్నాను. సమాజంపై (వ్యక్తిపై) దాని ప్రభావం ఏమిటి? రచనలోని అర్థాన్ని ఎంత మంది అర్థం చేసుకుంటున్నారు? ఆ రచన పర మార్థం ఏమిటి? మొదలగునవి ఆలోచించినప్పుడే అటి రచన పాఠకులను ఆలోచింపజేసి పాఠకుల

మనోఫలకంపై శాశ్వితంగా ముద్రించుకొని పది కాలాల వరకు ఉంటుంది.

అందుకు ఉత్తమాభిరుచిగల పాఠకులు ఆయా రచనలను నిశితమైన దృక్పథంతో పరిశీలిస్తారు. కావున రచయిత పాఠకుల యొక్క దృక్కోణము నుండి సాహిత్యమును దర్శించ వలయును. సహృదయుడైన పాఠకుడు ఎక్కువ అనుభూతిని పొందుతాడు

భావకులైన వాళ్ళు సాహిత్యాన్ని హృదయంతో చదువుతారు, అంటే కేవలం శ్రద్ధతోనో, ఆసక్తితోనూ చదవడం కాదు తన్మయత్వంతో చదవడం అందులో లీనమై చదవటం. సాహిత్యమంటేనే హృదయానుభూతుల చిత్రణ. కనుక పాఠకులు ఆ పాత్రలో గాని సన్నివేశంలోగాని పాత్రచిత్రణలో తాదాత్మ్యం చెంది చదువ గలిగినపుడే సాహిత్యాన్ని సంపూర్ణంగా ఆస్వాదించగలరు. ఇట్టిబాధ్యత రచయితశక్తిసామర్థ్యంపై ప్రజ్ఞా పాటవములపై ఆధారపడియుండును

నేడు ఉదయిస్తున్న సాహిత్యం స్వాప్నిక జగత్తులో విహరింపజేస్తూ భ్రమలో బ్రతికేటట్టు చేస్తున్నాయే తప్ప నిజస్వరూపానికి దర్పణం పట్టే రచనలు రావడంలేదు.

తెలుగు సాహిత్యానికో విశిష్టతనూ, గుర్తింపును ఇచ్చి తెలుగు కథలను (పాలగుమ్మి పద్మరాజు 'పడవ ప్రయాణం') అంతర్జాతీయ స్థాయికి తీసుక వెళ్ళిన నిన్నటి తరం రచయితల రచనలు నేటి ఆధునిక కాలంలో ఉద్భవించడంలేదు

కాబట్టి సాహిత్య విలువలను దృష్టియందుంచుకొని రచనలు చేయడం ఉత్తమోత్తమం రచయితకు రచనపట్ల స్పష్టమైన అవగాహన, అభిప్రాయం కలిగి ఉండాలి అప్పుడే అట్టి రచన నిత్యనూతనమనిపించు కొంటుంది.

'నవ్యగతి లేని రచన చుక్కాని లేని నావలాంటిది'

ఏ రచన పాఠకుల హృదయాలలో పది కాలాలపాటు నిలిచి ఉంటుందో అట్టిదే ఉత్తమ రచన అనిపించు కొంటుంది.

అప్పుడే రచయిత ఆదర్శవంతుడవుతాడు,
రచన-ఆదర్శవంత మవుతుంది.

తెలుగు డిపార్టుమెంట్
యూనివర్సిటి ఆఫ్ హైదరాబాద్
హైదరాబాద్ 500 134.

## విధి

చావు సొంత గూటిలోకి
మనిషిని
విధి నడిపించే మార్గాన్ని చూడు
కిర్మీర కాంతుల
వలయాన్ని కల్పించి

ఆనంద బాష్పాల్ని పుష్పించి
హృదయంలో
మల్లెల పరిమళాన్ని గుమ్మరించి
మనసుకు రెక్కల్ని మొలిపించి
తిప్పుతుంది విలాసంగా
తిప్పి, తిప్పి
పల్లటీలు కొట్టించి
ప్రమాదాల విషతంతువుల్లో ఇరికిస్తుంది
ఒక్కసారిగా

ఉమ్మిటి విఘ్నేశ్వరరావు

# స్పర్థా సాహిత్యం

— సి. యస్వీ. అచ్యుత

'స్పర్థయా వర్ధతే విద్యా' అని సంస్కృతోక్తి. మనం మామూలు విషయాల్లో ఎలా ఉన్నా విద్య బాగా రావాలి. అంటే స్పర్థ ఉండాలి అనేది దీనికి అర్థం. స్పర్థ అనే దానికి చాలా అర్థాలున్నాయి. ఒక్కొక్కసారి స్పర్థలు బాహా బాహీకి దిగినట్లు కనబడతాయి. మానసిక స్పర్థ ఉన్నప్పుడు ఎదుటి వాడి ఔన్నత్యాన్ని సహింపక పోవడం,అది పెచ్చు పెరిగితే ఈర్ష్యలోకి లాగి మానవుడి పతనానికి దారి తీస్తుంది అయితే విద్యలో స్పర్థ అహంకారాన్ని కలిగించాలి. అటువంటప్పుడు అతనికి మౌలికంగా అభిమానం ఉండాలి. అభిమానం ఉంటే అతడు సాటి వారితో అన్నింటిలోను సమంగా ఉండటానికి ప్రయత్నిస్తాడు. అహం కారం ఉన్నవాడు సాటివాడి కంటే అన్నింటిలోను మించడానికి ప్రయత్నిస్తాడు. ఎదుటి వాడితో పడక పోవడాన్ని మనం స్పర్థగా చెప్పు కుంటాం 'వాళ్ళిద్దరికీ మధ్య స్పర్థలున్నాయి- మాట్లాడుకోరు' అని. ఇలాంటి సందర్భాల్లో స్పర్థ ఈర్ష్యాగ్రస్తంగా ఎక్కువ పాళ్ళు ఉంటుంది.

'గురజాడ' కూడా 'పూను స్పర్థలు విద్య లంటే- వైరము వాణిజ్య మందే' అంటారు. అంటే స్పర్థ మనిషిని అన్ని విధాలా ఉన్నతుడిని చేయ డానికి తోడ్పడాలన్నది సారాంశముగా గమనించ గలుగుతాం.

మనకి ఇంతవరకు వెలువడ్డ సాహిత్యాన్ని స్థూలంగా సమీక్షించినట్లయితే 'స్పర్థయావర్ధతే విద్యా' అనే కాదు 'స్పర్థయా వర్ధతే సాహిత్యం' అని కూడా చెప్పడం అసమంజసం కాదేమోనని పిస్తుంది.

సాహిత్యం పరిధి విస్తృతం కావడానికి, విలువైన రచనలు రావడానికి స్పర్థ ఏ విధంగా ఉపయోగ పడింది? స్పర్థతో ఎంత వరకు ఎలాంటి రచనలు వచ్చాయి. సాహిత్యాభివృద్ధికి ఎంతవరకు తోడ్పడింది.స్పర్థ ప్రభావంతో వచ్చిన సాహిత్యం మొదలైన అంశాలను తడమటమే ఈ వ్యాస ముఖ్యోద్దేశ్యం.

స్పర్థ అన్నప్పుడు ప్రతీ అంశంలోను స్పష్టంగా, ప్రత్యక్షంగా గోచరింపక పోయినా, పచ్ఛన్నంగా స్పర్థముద్ర ఉందని సూక్ష్మ పరిశీలనం వల్ల గమనించవచ్చు. ఈ సందర్భంలో ఆచార్య భేతవోలు రామ బ్రహ్మం గారి వాక్యాలు గమనించ దగ్గవి.

'కవిత్వమూ కవులూ అంటేనే తగవుంకి,
తగాదాలకి పెట్టింది పేరు
నిజమో, అబద్ధమో కాని ఈ సంప్రదాయం
నన్నయ్య, భీమన్నల దగ్గర

నుంచీ కనపడుతూనే ఉంది. అటు సంస్కృత సాహిత్యంలోనూ ఇవి ఉన్నాయి. అవి 'ద్రవిడ శిశుః' దాకా వెళ్ళాయి సరే తెలుగులో అయితే రూపంలో కూడా 'బజారు' తడుము కున్నారు'

పురాణ రచనా కాలం నుంచీ ఈ స్పర్ధ ఉందేమోనన్న అనుమానం కలుగుతుంది. నేటి ఆధునిక సమాజంలో ఒక మేధావితనం లేని వారు కూడా ఎదుటివాడి ఉన్నతినిఏదోవిధంగా పడ గొట్టాలన్న కాంక్షతో ఉన్నట్లు కనబడుతున్నారు. అటువంటప్పుడు అపార మేధస్సును సహజ కుండలాలవలే ధరించిన పండిత ప్రకాండులు ఎదుటివాడి గొప్పతనాన్ని ఎలా సహిస్తారు? సహించరు. ఎవరైనా తమ సిద్ధాంతం నిలవాలంటే ఒక గొప్ప వ్యక్తిని తమ వాదానికి ఊతగా నిలుపుకుంటారు. ఒకే వ్యక్తి తను అనుకూల, ప్రతికూలంగా రచనలు చేయడం జరుగదు. అందులోనూ తన కంటూ ఒక ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్నవారి విషయంలో అది మరీ అన్వర్థం.

పురాణాలన్నీ వ్యాసుడే రాశాడంటారు. రాయడం ఆయనకు కష్టం కాకపోవచ్చు. కానీ కొన్నింటిని శైవపరంగాను, కొన్నింటిని వైష్ణవ పరంగానూ, దేవీ పరంగానూ, ఇలా రచనలు చేయడం అంత మహోన్నతుని వ్యక్తిత్వానికే భంగం. అందుచేత పురాణాలన్నీ వ్యాసుడుఒక్కడే రాయలేదని చెప్పవచ్చు. అవి అపౌరుషేయాలని అనలేం. మనకు తెలిసినంత వరకు ఏ దేవుడి భక్తులు ఎలా తమ ఇష్టదైవం మీద కావ్యాలు, శ్లోకాలు, వెలయిస్తున్నారో అదే విధంగా ఆ దైవం పేరుతో పురాణాలు రాసి, తమ అస్తిత్వాన్ని తెలియనీక, కర్తగా వ్యాసుని పేరు పెట్టి ఉండవచ్చు. అలా చేయడం గ్రంథప్రాశస్త్యం కోసమే కావచ్చు.

తెలుగు సాహిత్యం ఇబ్బడిముబ్బడిగా వెలువడుతున్న రోజుల్లో శైవ, వైష్ణవ పరాలైన కావ్యాలు ఎలా వచ్చాయో, అదే విధంగా పురాణాలను కూడా ఆయా మతాలకు చెందిన వారు రాసి ఉంటారు. శైవ గ్రంథం వచ్చిందని వైష్ణవం, వైష్ణవపురాణం వచ్చిందని శైవపురాణం వెలువడుతూ ఉండి ఉంటాయి (2) చివరికి తిక్కనలాంటి మహానుభావుని ఆవిర్భావంతో ఉభయాత్మకాలైన పురాణాలు కనబడుతున్నాయి. పురాణాలు పరిణామం ఎలా ఉన్నా ఇక్కడ మౌలికంగా ఉన్నది 'స్పర్ధ' అని గమనించాలి. ఇక్కడ 'స్పర్ధ' దైవ పర మైనదిగా కనబడు తుంది అందు మూలంగానే ఈ స్పర్ధ అనేక పురాణాల ఆవిర్భావానికి అంకురమైంది.

సంస్కృత సాహిత్యంలో కూడా స్పర్ధ మూలంగా వెలువడిన రచనలు ఉన్నాయి. స్పర్ధ ప్రేరకంగా రచనా సందర్భాన్ని పరిశీలిద్దాం. ఇది మాఘుని 'శిశుపాలవధ' రచనా సందర్భంలో కనబడుతుంది.

"వర్ణనా క్రమంతో సహా మాఘుడు భారవి కథ సంవిధానాన్ని అనుకరించి రచించాడు. భారవి రచించిన దీర్ఘమైన రాజనీతిని ప్రకటించే సంభాషణలను, రమ్యమైన ప్రకృతి వర్ణనలను, అలంకార భావ కల్పనలను, ఛందో యోజనాలను అనుకరిస్తు ఒక్కొక్కసారి భారవిని మించవలెననే ఆహ మహమికతో మాఘుడు శిశుపాలవధ కావ్యాన్ని రచించాడు. ఆ ప్రయత్నంలో మాఘుడు సఫలుడైనాడనే చెప్పాలి. భారవి శైవుడు కాబట్టి శివ సంబంధమైన మహాభారతాంతర్గత కథను ఎన్నుకొన్నాడు. మాఘుడు వైష్ణవుడు కాబట్టి విష్ణు కథను ఎన్నుకొ

న్నాడు. ఇద్దరికీ మహాభారతమే స్రోతస్సు. భారవి మాఘులు సమకాలికులు కారు. వారి ద్దరి నడుమ ఒక శతాబ్ది కాలమైనా భేద మున్న భారవి దక్షిణాత్యుడు. అత నికి వేంగినేలిన విష్ణువర్ధనుని, పల్లవ రాజు సింహవిష్ణువు ఆస్థానంతో సంబంధమున్నట్లు చెప్పబడుతున్నది. మాఘుడు ఔత్తరాహుడు. గూర్జర దేశస్థుడు. అటువంటప్పుడు మాఘు నికి భారవిని మించవలెననే స్పర్థ ఎందుకు కలిగిందో చెప్పలేము. మాఘుడు వైష్ణవుడు, భారవేమో శైవుడు. ఆ స్పర్ధతో ఏమైనా మాఘుడు భారవి కావ్యాన్ని మించదలుచు కున్నాడేమో చెప్పలేము. లేకపోతే భారవి కావ్య వైభవం చేత ఆకర్షితుడై అటువంటి కావ్యాన్నో, లేక దాన్ని మించిన కావ్యాన్నో రాయాలనే కోరిక మాఘునికి కలిగివుంటుంది.

ఇంకా అలంకారిక గ్రంథ రచనా సంద ర్భంలో కూడా ఈరకపుసాహిత్యందర్శనమిస్తుంది అప్పయ్య దీక్షితులుగారు చిత్ర మీమాంస అనే అలంకార గ్రంథం రాశారు అందులో ధ్వనివాదులు అధమ కావ్యంగా చెప్పిన చిత్రకావ్యాన్ని అప్పయ్య దీక్షితులుగారు మహత్వ పూర్ణమైందిగా అంగీక రించారు. ధ్వని ఏమాత్రం లేని చిత్ర కావ్యానికి ఉత్తమత్వంపల్పించడం సహించలేని జగన్నాధుడు దీక్షితులు గారి గ్రంధాన్ని ఖండిస్తూ "చిత్ర మీమాంస" ఖండనని రచించాడు.

ఇక్కడ జగన్నాధుడు గ్రంథ రచన కావిం చడం దీక్షితులుగారిపై స్పర్థతోనేనని చెప్పుకోవచ్చు.

తెలుగు సాహిత్యం నన్నయ్యతో ఆరంభ మైంది. నన్నయ్య తర్వాత శివకవులు కనబడ తారు వీరు నన్నయ్య బాటలోనే నడిస్తే వారి ప్రత్యేకత ప్రస్ఫుటంకాదు. తమ వ్యక్తిత్వాన్ని ప్రకటించుకోవాలి అంటే కొత్త మార్గం తొక్కక తప్పదని గ్రహించారు. అందుకే పూర్తిగా మత ప్రచారం కోసం సాహిత్యం వెలయించారు.

ఇక్కడ శివకవుల్ని నన్నయ్యకంటేభిన్నంగా నడిపించిన స్పర్ధ-మతం, ఆ తరువాత స్పర్థ తో వెలసిన సాహిత్యం ప్రబంధ యుగంలో కనబడు తుంది అదీ ప్రత్యేకించి పింగళి సూరనలో కనబడు తుంది. అతనిలో ఉన్న స్పర్థను వివరిస్తూ ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు ఇలా అంటారు.

పింగళి సూరన గొప్ప ప్రతిభావంతుడు. అతని వయసుతో పాటు ప్రతిభయు నవనవోన్మే షముగ విస్ఫారినది. లోకమున ప్రతిభాశాలుర కుండదగిన-ఉండ వలసిన గూఢాహంకారము పుష్కలంగా నున్నది. అహంకారి సాటివానికంటే నన్నింట మించుటకు ప్రయత్నించును. పింగళి సూరన కలము పట్టువానికి సాహిత్యరంగమున ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని పెద్దన్న అగ్రపీఠము నలంకరించి యున్నాడు. మించినచో అతనినే మించవలయును. మించుటకు ఒకటిరెండు త్రోవలు కలవు. ఒకటి అతడొక విధమైన ప్ర బం ధ మార్గమునకాచార్య పీఠము. ఆ మా ర్గ ము ను వీ డి మ ఱి యొ క ప్రక్రియను చేపట్టి దానతానగ్రతాంబూలమందు కొనవలెను. ఇట్లు భావించి అతడు ద్వర్థికావ్య రచనా ప్రక్రియను చేపట్టి రాఘవ పాండవీయమును రచిం చెను. ఆ యుగము నందలి రచనలలో అది అ పూర్వము. తరువాతి ద్వర్థి త్ర్యర్థి చతురర్థి కావ్య రచనలకది ఆచార్యకమునైనది.

ఇక రెండవది, పెద్దన రచించిన ప్రబంధము వంటి ప్ర బం ధ ము న నే చే ప ట్టి అతని కంటే వైశిష్ట్యమును సాధించుట అతడు స్వారోచిషమనుసంభవమును రచించెను. ఇతడు కళా పూర్ణోదయమును రచించెను...కవి లోకమున పెద్దనకంటే పెద్ద అనిపించుకొనుటకే సూరన చేసిన యింత పెద్ద ప్రయత్నము.

పెద్దన తరువాత ఇతని దృష్టి నంది తిమ్మయపై ప్రసరించినది. అతడు హరివంశ కథా లహరి నుండి పారిజాతాపహరణ వృత్తాంతమును గ్రహించి మధురమైన యొక ప్రబంధమును రచించెను ఇతడును హరివంశము నందలి ప్రభావతీ పరిణయ వృత్తాంతమును గ్రహించి నాటకీయ రచనా శిల్ప మచ్చు పడునట్లు ప్రభావతీ ప్రద్యుమ్నమును రచించెను. పింగళి సూరన రచించిన ప్రతి కావ్యము వెనుక ఏదియో గూఢమైన విజిగీష యొకటి ప్రేరణగా పనిచేసినది. కావ్య విషయకమైన ఆ దర్పం స్పర్ధ అతనికి కళాపూర్ణునిగా రూపొందినది.

ఇక్కడ సూరన చేత భిన్న ప్రయోగాలు చేయించిన స్పర్ధ—అతనిలో ఉన్న ప్రతిభ.

ఆధునిక సాహిత్యంలో కూడా ఇలా స్పర్ధతో వచ్చిన సాహిత్యం కనబడుతుంది. పై (యుగాల్లో) సందర్భాల్లో దేవుడు, మతం, ప్రతిభ స్పర్ధమే కారణాలైతే, ఈ యుగంలో దృక్పథ భేదం స్పర్ధకు కారణంగా కనబడుతుంది. ఈ యుగపు స్పర్ధా సాహిత్యంలో కొంత ఈర్ష్య కూడా చోటు చేసుకొన్నట్లు కనబడుతుంది

విశ్వనాథ వారు 'రామాయణ కల్ప వృక్షము'ను రచిస్తే, రంగనాయకమ్మ గారు విశ్వనాథ వారి కల్పవృక్షం మీద స్పర్ధతో 'విష వృక్షం' గ్రంథాన్ని రాశారు. కృష్ణశాస్త్రిగారు 'కృష్ణ పక్షా'నికి స్పర్ధతో అనంత పంతులు రామలింగ శాస్త్రిగారు 'శుక్లపక్షా'న్ని' రాశారు.

కమ్యూనిజం వస్తే దేశం ఏమై పోతుందో సూచిస్తూ కాల్పనికంగా విశ్వనాథ వారు రాసిన 'సముద్రపు దిబ్బ'కు స్పర్ధతో 'దిబ్బ పుట్టక'ను రాశారు కొడవటిగంటి కుటుంబరావుగారు (సమాజ సాహిత్యాలు–70 పుట). 'స్పైడర్ హోమ్స్' అనే ఆంగ్ల నవల స్పర్ధతో స్ఫూర్తితో రాసిన నవల 'స్వీప్ హోమ్స్' 003 అనేది.

సుగుణ శతకం-దుర్గుణ శతకం, భారతం-గీరతం ఇలాంటివి 'నాకు' మరి కొన్ని స్పర్ధలు.

విషవృక్షంలో విశ్వనాథ వారి కంటే గొప్ప ప్రయోగం చేయాలని ఆలోచన లేదు. ఆయన దృక్పథాన్ని ఖండించాలనే స్పర్ధదే పై చేయి కృష్ణ పక్షం, సముద్ర దిబ్బ, స్వీప్‌హోమ్స్‌పై కూడా ఈ దృష్టితోనే రచనలు వెలువడ్డాయి

మొదటి 3 సందర్భాలో ఈ యుగంలో స్పర్ధ పాండిత్యం కంటే వ్యక్తిత్వంపై, రచనపై ఉన్నట్లు కనపడుతుంది. అందుచే పేరును అనుసరిస్తూ వ్యతిరేక ధోరణిలో ఉండేలా స్పర్ధాసాహిత్యానికి పేర్లు పెట్టడం కనబడుతుంది. ఇంకా కేవలం మొదట వెలువడిన సాహిత్యానికి స్పందించి, దాన్ని ఖండించే ధోరణిలోనే ఉండేలా సాహిత్యాన్ని వెలయించడానికి పూనుకోవడం కూడా ఉంది. అందుకే వ్యక్తిగతంగా మారిన 'స్పర్ధ' సరికొత్త, ఉత్కృష్ట సాహిత్యాన్ని వెలయించడానికి దోహదకారి కాలేకపోయినదని చెప్పవచ్చు.

మొదటిగా దైవాన్ని అడ్డుపెట్టుకొని సాగించిన స్పర్ధ కారణంగా వివిధ పురాణాలు వెలువడి పురాణసాహిత్యం పరిపుష్టమైంది. శివకవులు స్పర్ధతో సాహిత్యం వెలయించి తమ లక్ష్యాన్ని సాధించారు. అసలు సిసలైన స్పర్ధతో ఉత్తముడుగా ప్రతిష్ఠను పొందినవాడు సూరన. పెద్దనాదులు నుంచి స్ఫూర్తిని తీసుకొన్నాడు అందుచే అతడు తనదన్న 'స్పర్ధ' మూలంగా ఉత్తమ రచనలు - ఉత్తరోత్తర వెలయించ గలిగాడు, ఆధునిక యుగ స్పర్ధ మౌళిక

మైన పునాదికి భంగం కలిగించింది. వ్యక్తిగత స్థాయికి దిగజారిన స్పర్థ ఉత్తమ రచనలు వెం యించలేక పోయింది.

సంస్కృతంలో భారవి, తెలుగులో శివ కవులు, పింగళి సూరనలు ఒకరకపు వారైతే, మిగి లిన వారు మరోరకపు రచనలు కావించిన వారుగా కనబడతారు. మొదటి వారు ముందరి రచనలను రచనలు చేయాలను కుంటే, రెండో రకం వారు ఖండన కోసం రచనకు పూనుకున్నట్లు ఆయా గ్రంథాల పేర్లతో పాటే స్పష్టమౌతుంది.

ఇలా స్పర్ధతో వెలువరించిన ఎన్నో రచన లున్నాయి. మౌలికంగా కొన్ని రచనలను మాత్రం స్థూలంగా పరిచయం చేయడం జరిగింది. ఈ రకమైన వివేచన సరియైందనే వాదం బలం కలి గిందైతే, మొత్తం రచనలు సేకరించి తద్వారా సాహిత్యం పొందిన ప్రయోజనాన్ని సమగ్రంగా అధ్యయనం చేయవచ్చు. సరికొత్త వివేచనా దృక్ప థాన్ని విమర్శకలోకానికి అందించి, కొత్త సిద్ధాం తాన్ని స్థాపించవచ్చు.

పరిశోధక విద్యార్థి
తెలుగు విశ్వవిద్యాలయం
రాజమండ్రి.

# దృశ్యరాగం

కని పించిన దృశ్యాల్లో
వినిపించిన రాగాలెన్నో....!
అణువుల అంతర్మథనంలో
అణగారిన ఆశలెన్నో....!
విశ్వం విడచిన నిశ్వాసంలో
విడమరచి చెప్పిన భావాలెన్నో
పాటల పల్లవి పచ్చదనంలో
ప్రకృతి మలపుల జీవితం
పరిమిత ప్రవాహమై
ప్రసవ వేదన పడుతుంది.
ఎముకల గుండెల్లో ఎగసిన
విషాద విచార జలపాత ధారల్లో
కొట్టుమిట్టాడిన నిశ్శబ్ద చలనచిత్రం
కోటి కన్నుల్ని చెమర్చిన విషాద నాదం.
కడుపులో కదిలిన ఆకలి జ్వాలలు,
కొండెక్కి కూర్చున్న ఆర్థిక లీలలు;
సుళ్ళు తిరుగుతున్న బ్రతుకు అలలు
సుంగి పోతున్న సంధ్యా వేళలు;
రగిలిన ఎదల రక్తపు చారికలు;
పగిలిన హృదయపు కాలి జాడలు
మనసున్న మనిషి మస్తిష్క వీణపై
మాయని దృశ్య రాగ ధ్వనులు!

సి. కామేశ్వరరావు

# పడిపాటివారి దేశభక్తి గీతాలు

— చెళ్ళపిళ్ళ సౌభాగ్యకామేశ్వరి

జాతీయోద్యమంలో పాల్గొన్న దేశభక్తులూ అవధానాలు చేసిన కవితా మూర్తులు శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రిగారు. సాహిత్యంలోని అన్ని ప్రక్రియలలోనూ రచనలు చేసిన ప్రజ్ఞా వంతులు, స్వయంగా నటనానుభవం కలిగినవారు. నాటక సాహిత్యమే గాక నృత్య సాహిత్యం కుడా నిర్మించారు. వీరి జాతీయ గీతాలు భావగీతాలు సుప్రసిద్ధమైనవి.

సంప్రదాయ కవితా రీతుల్లో ప్రావీణ్యత గల సుకవులు గేయకవితలు వ్రాసినపుడు వారికి భాషపైగల అధికారం వలన అందమైన పదబంధాలు సహజంగానే అమరుతూ ఉంటాయి. ఈ కోవకు చెందిన గేయ సంపదలో పైడిపాటి వారి గీతాలను పేర్కొన వచ్చు ఎన్నో గీతాలు ఆకాశవాణి ద్వారా ప్రసారమయ్యాయి.

వీరి దేశభక్తి గీతాలు మూడు సంగ్రహాలుగా వెలువడ్డాయి. జాతీయ భారతి-జయభారతి (ఒకే పుస్తకం) విజయ భారతి, విక్రయ భారతి, మిగిలిన రచనలలో కూడా సందర్భ వశాత్తూ దేశ భక్తి పూరిత ప్రసంగాలు కన్పిస్తాయి. 1963 లో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధాల శాఖవారి సంకలనాలు రణభేరి, శంఖారావంలలో శాస్త్రిగారి గీతాలు స్వీకరించబడ్డాయి. ఇంతేగాక శ్రీదాశరధి రంగాచార్యగారి ద్వారా సమర్పించబడిన మరొక సంకలనం రణభేరిలో కూడా శాస్త్రిగారి కవిత్వాలు పొందుపరచ బడ్డాయి. 1956-57 లో అఖిలభారత సాహిత్య అకాడమీ, ఢిల్లీవారి ద్వారా ప్రచురితమైన 'భారతీయ కవితా' అనే సంకలన గ్రంథంలో వీరి గేయాలు, (ఆసియా మహాద్వీపం. వృక్షాత్మ) శ్రీరామమూర్తి రేణు గారి హిందీ అనువాదమూ ప్రకటించబడ్డాయి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ; హైదరాబాదు వారి ద్వారా ప్రచురితమైన ఆధునిక తెలుగు కవితా అనే హిందీ సంచలనంలో శాస్త్రిగారి వసంతఋతుపు పద్యాలు శ్రీచావలి సూర్యనారాయణ మూర్తిగారి హిందీ అనువాదమూ ప్రచురితమయ్యాయి.

ఆగష్టు 15, 1947 మన స్వాతంత్ర్య దినోత్సవ శుభ సమయం. వీరిగీతం ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు కన్నామీ స్వాతంత్ర్యం, 1959 ఆగష్టు15న లెనిన్ గ్రాడ్ విశ్వవిద్యాలయంలోని విద్యార్థులచే గానం చేయబడి అక్కడ టెలివిజన్లో ప్రసారమైంది. ఇది రష్యన్ ప్రజల విద్యార్థుల ఆదరాభిమానాలకు పాత్రమైనట్లుగా లెనిన్ గ్రాడ్ యూనివర్సిటీ తెలుగు విభాగం అధ్యక్షురాలు శ్రీమతి ఆదిలక్ష్మిగారు వ్రాసిన లేఖ 17-2-60 ఆంధ్ర ప్రభ వారి పత్రిక ప్రచురించబడింది.

శాస్త్రిగారి రచన త్రిలింగదేశం మనదేనోయ్ తెలుంగులంటే మనమేనోయ్ పాట వినని ఆంధ్రులుండ రంటేఅతిశయోక్తికాదు ప్రాథమిక పాఠశాలదశలోనే విద్యార్థినీ విద్యార్థులకు సుపరిచితమైన గేయం. ఇది నాట్యాచార్య శ్రీ బి.వి. నరసింహారావుగారు ఈ పాటకు నృత్యబాణిని అభ్యసించిన శ్రీమతి వారణాసి-కామాక్షి ఈ పాటకు బహుమతులు అందుకున్నారు. శ్రీయుతులు గుడిమెట్ల కృష్ణ, కోరాడ వంటి ప్రముఖులు ఈ పాటకు నాట్యం చేసారు. ఈ పాటను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు జాతీయ గీతంగా ఆదరించారు. ఈ గీతాన్ని పురస్కరించుకొని ప్రపంచ తెలుగు మహా సభల సందర్భంలో పైడిపాటి వారికి సన్మానం చేశారు. జాతీయభారతి-విజయభారతి కవితా సంపుటిలో ఈ గేయాలు పొందు పరచబడినవి.

మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత నవభారత నిర్మాణం కర్తవ్యమైంది. ఈ విషయం ఉద్బోధిస్తూ శాస్త్రిగారు తమ గీతంలో-

> నవ భారత నిర్మాణంలో
> ఎవరెవరిది ఎంతటిపాలో
> ప్రతి పౌరుడు యోచించాలి
> ప్రతి గ్రామం ఘోషించాలి'

అని పేర్కొన్నారు.

విశాలాంధ్రను వారి కవిత్వాల్లో కీర్తించారు. భారత మాతకు నివాళులర్పించారు. భూదానయజ్ఞం ఖద్దరు, పొదుపు, నాగార్జున సాగర్ నిర్మాణం, రైతు ప్రాముఖ్యతమొదలైన అంశాలన్నీ గానం చేశారు. ఆయుర్వేద ప్రాముఖ్యతను నొక్కి వక్కాణిస్తూ.

> 'దేశమంటే మట్టి
> దేశమంటే మనిషి
> దేశీయ వైద్యమ్ము
> తేజరిల్లాలి

అని అభిలషించారు.

> 'ఆత్మ పరీక్ష' అనే గేయంలో
> 'పుట్టినావీ భరతదేశాన
> చేత పట్టినావా, గీత ఎప్పుడైనా?...'

అని ప్రశ్నించి

> 'జాతి నడిపిస్తాను
> అంటావు-నీవు
> జాతీయతా దీక్ష
> పొందావా?'

అని ఆత్మపరీక్ష చేసుకోవలసిన అవసరం తెలియజెప్పారు

అందువల్లనే 'ఈ జాతీయగీతావళి సర్వులకూ సులభగ్రాహ్యమగునట్లు రచించబడి రచయిత భావౌన్నత్యమును వెలిబుచ్చినది' అని శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు ప్రశంసించగా 'తమిళనాడుకు సుబ్రహ్మణ్య భారతి ఎట్లో తెలుగునాడుకు సుబ్బరామశాస్త్రిగారు అట్లు' అని శ్రీ అయ్యదేవర వారు ప్రశంసించారు.

విజయ భారతిలో గీతాలు మూడు విధాలుగా ఉన్నాయి. మాతృదేశ ప్రశంస చేసే గేయాలు. వీటిలో భారత మాతనూ, మరియూ తెలుగుతల్లినే కీర్తించడం జరిగింది. మరికొన్ని గేయాలు ప్రబోధాత్మకమైనవి. వీటిలో కర్తవ్యాన్ని బోధించటం జరిగింది. మిగిలిన వాటిలో దేశభక్తులైన తోటి స్వతంత్ర వీరులనూ వారి స్వరూప స్వభావాలనూ చేసిన కృషినీ వర్ణించారు. ఈ గేయాలన్నిటిలోనూ కవి సానుభవాలు కళ్ల ఎదుట నిలుస్తాయి.

భారతీయతయే గేయాలన్నిటిలోనూ ప్రాధాన్యత వహించినాగాని ఆంధ్రుని కవితలో ఆంధ్రత్వం ఉట్టిపడుతూనే ఉంటుంది. జాతి విపంచి అనే గేయంలో శాస్త్రిగారు,

'భారతీయుడ, తెలుగువాడ
నావాడ!
పాడరా, జాతి ఏపంచి
పలికించి
దేశ దేశాలలో
తీర తీరాలలో
వాసి కెక్కిన దేశ
వైభవము పాడగా

అని ఉత్సాహ పరుస్తారు 'భారతీయుడ' అనడంతో పాటు 'తెలుగువాడ! నావాడ!' అనడంలో ఆత్మీయత నిండి ఉంటుంది.

'రాజువోలె రా రా!
రాజువోలె రా రా!
వంగి వంగి దండాలను
సంగతులికి రేవురా
భారతీయుడని నిన్ను
పేరున పిలిచేరూ

అనే గీతంలో స్వరాజ్య ప్రాప్తిలోని ఆనందం, గర్వం, స్వేచ్ఛా స్పష్టమౌతున్నాయి. ఎన్నో గేయాలలో తెలుగునాటి కవులనూ, దేశభక్తులనూ, కళాకారులనూ ప్రశంసిస్తూ కైమోడ్చారు. తెనుగు దేశాన్ని 'పునుగు జవ్వాది తావి'గల దేశంగా కీర్తించారు.

దేశభక్తులైన స్వాతంత్ర్య వీరులను కొన్ని గేయాలలో పరిచయం చేశారు. మళయాళ కవి శ్రీ వల్లిథోలీ, బెంగాలీ వారైన బంకించంద్ర, హరీంద్రులు, తెలుగువారిలో మంగిపూడి వేంకట శర్మ, కోడె రంగాచారీ, గురజాడ రాఘవ శర్మ కాళోజీ మొదలైన వారిని ప్రస్తుతించారు. ఒక గేయంలో కోడె రంగాచారి గార్ని సంబోధిస్తూ:-

'పెరేల్ పెరేల్మని ప్రేలెను బొమికెలు
కట్టికొట్టగా నినుదొరలు
కట కట జైలున కట కట బడి
నే బొట బొట కార్చితి కన్నీరు'

అని నాటి పరిస్థితిని స్మరించారు. తెల్లవారలు పెట్టిన హింస బొమ్మకట్టినట్లుగా స్పష్టమౌతుంది పై గేయంలో.

విక్రమ భారతి వీరగీతాల వెల్లువ ఇది చైనా పాకిస్తాన్ యుద్ధ సమయాలలో వ్రాసిన గీతాల సంగ్రహం.

తెలుగులో తొలిగా ప్రకటించబడిన యుద్ధ గీతం శాస్త్రిగారి రచన

'తరుమండీ తరుమండీ
తరిమి తరిమి కొట్టండీ
దురాక్రమించే పరాయిసేనను
పరాక్రమించే తరుమండీ'

శాస్త్రిగారి కవితలో భావనా బలానికీ, భాషా పటిమకూ మచ్చుతునకగా గల మరొక దేశ భక్తి గీత పరిశీలనార్హమైనది.

'కదలండీ కదలండీ
కదలి కదలి విక్రములై క్రములై
ఎదురు బెదురు లేకయే పోరండీ
వచ్చి పడిన అరి వుచ్చె పగుల్చన
చిచ్చులు మిసి, విచ్చుపోలికను
కతారమైనా, కుతారమైనా
పెటిలు పెటిల్లను ఫిరంగులైనా
వెన్నిచ్చిన అరి వెన్నాడండీ
తగిలి తగిలి పగతుర నరకండీ'

పై గేయం వీర రస ప్రధానమై మనస్సును యుద్ధభూమిలో విహరింపజేస్తుంది.

శాస్త్రిగారి గీతాలలో జవానుకే కాక కిసాను (రైతు)ను కూడా సందేశాలున్నాయి.

మన పంటలు పండితే
మన గరిసెలు నిండితే
మన కోసం పోరాడే
మనుషుల తూటాకు దండి

'ఇంటి యొద్దగారాలా?' అలాగే.

ఈ చాలున మన చేను
ఇబ్బడి పండించాలి
ఈ దేశం కోసమింక
ఇనుమడి కష్టించాలి

(కోడి కూసె కోడి కూసె)

పై రెండు గీతాలలోనూ పల్లెలలో రైతులను వారి పత్నులు పొలాలకు పంపే సందర్భం వర్ణించబడింది

శాస్త్రిగారి గేయాలలో కొన్ని సంవాద రూపంలో ఉన్నాయి. ప్రశ్నలూ వానికి జవాబులు ;

ఏ దేశమురా నీది?
ఏ దేశము?
ఈ దేశమే నాది
ఈ దేశమే
దక్షిణమ్మున పుట్టి
తన ధర్మమే దేశ
ధర్మమ్ముగా నిలుపు
స్వామి పేరేమి?
స్వామి యన్ననే చాలు
జగమునకే గురుడు
కాలడి గ్రామమ్మ
కన్నదాలేనిని

ఇలాగే

'నీ తల్లి సిగపూవు
ముట్టి నాడెవడా
నీతి మాలినవాని
నేమి చేసెదవు ?
నా తల్లి సిగపూవు
నను చేయివేయు
ఆ దురాత్ముని బట్టి
కరము ఖండింతు

(విక్రమ భారతి)

శాస్త్రిగారి గీతాలలో కొన్నిచోట్ల ధ్వనులు మాత్రమే పూర్తి శబ్దార్థాలను ప్రకటిస్తుంటాయి. ఉదాహరణకు :

'తెలుంగు ఝుండా ఘుం
తెలుంగు భేరీ ఢాం'
గణ గణ గణ గణ, గణ గణ, గణ గణ
తెలుంగు జయ ఘంటా
గణాగణా గణ గణాగణా గణ
తెలుంగు జయ ఘంటా

పై పాటలో ధ్వనులు ఉత్సాహాన్నీ, హర్షాతి రేకాన్నీ సూచిస్తూ ఆ గీతంలోని భావ సౌందర్యాన్ని ఇనుమడింప జేస్తున్నాయి.

శ్రీ తెన్నేటి విశ్వనాథం గారు చెప్పినట్లుగా 'వీరిగేయ కవిత్వం మధురమై సూటిగా ప్రజాహృదయాలలోకి చొచ్చుకు పోతుంది.' సరళత్వమూ స్పష్టతాశాస్త్రిగారి శైలీ విశిష్టత, శ్రీ పాద కృష్ణ మూర్తి శాస్త్రిగారి మాటల్లో 'వీరు ఆంధ్ర ప్రజా హృదయాస్థాన కవులు'.

హిందీ పండిట్
జడ్ పి. పి. హెచ్, స్కూల్,
జీలుగుమిల్లి (SO) 534453 పశ్చిమ గోదావరిజిల్లా

# శ్రీ పాంచాల రాయశతక విశిష్టత

పాతూరి రఘురామయ్య

సత్కవిత పద్యరూపంలో ఉన్నా గద్య రూపంలో ఉన్నా ఉపాదేయమే అని నా అభిప్రాయము. ఉత్కృష్టమైన కవితా కళ శోభిల్ల వలె కాని అది ఏ రూపంలో అందించబడిన దన్నది ప్రధానము కాదు, ఐతే ఒక్క విషయమున్నది. శబ్దార్థాలు రసభావాలు రెండింటిలోసమానమే అయినా పద్య కవితలో ఉన్న గతి సౌందర్యం వచన కవితలో లేదు. దానికి గల ఆదరణ దీనికి ఉండబోదు. కమ్మని పాయసాన్ని కమనీయ పాత్రలో అందించేది పద్య కవిత. ఈ సౌందర్యము ఈ సౌఖ్యము వచన కవితకు లేదు. పద్యకవితలో దాని శిల్పానికి పరిశ్రమ కావాలి. ఛందో విలసితమైన కవితకు విశేష ప్రయోజనాలున్నవి. వచన కవితకు ఆ పరిశ్రమలేదు. పద్యము వలన కలిగే ప్రయోజనమూ అందులో కానరాదు.' పూజ్యులైన వానమామలై వరదాచార్యులవారు.

సత్ సంప్రదాయమును, నవ్యతను ఆవిష్కరించుచు కావ్యరచనము చేసిన తపోధనులు ఆచార్యులవారు వారు పేర్కొన్న విధముగా పద్యమే వచనకవిత కన్న ఇంపైనది. అందుకు కారణము పద్యమునకు గల గతి సౌందర్యము ముఖ్యముగా భక్తిరసము వ్యంజితమైన తాత్త్విక శతకమైన, శ్రీపాంచాల రాయస్వామిపై ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు రచించిన ఈ శతకానికి పద్యము వాహికగానే శోభిస్తుంది. ఈ శతకం మధ్యాక్కరలలో నూతనమైన అభివ్యక్తి ఆవిష్కృతమైనది.

సుప్రసన్న! ఇది కవిపేరు, వీరి కవిత్వమూ ప్రసన్న గుణశోభితమే.

ఎదవిచ్చియుంటిని కావవే నన్ననన్య శరణుడ
తుదయేదో తెలియదు కాచెదో నన్ననన్య భోగ్యుండ
మది తొందరించెదు ప్రోవుమా నన్ననన్య శేషుండ
ప్రిదుల నీయకు ముదుల సురభీభంగ! పాంచాలరాయ!

జీవునికి, ఈశ్వరునికిగల అనుబంధం యొక్క విస్తార రూపము చివరి పాదంలో పరోక్షంగా వ్యక్తమైంది. ఇందులో ఆద్యంత ప్రాసలే కాకుండా పద్యాన్ని ఎత్తుకొని నడిపే రీతిలో ముగింపులో ఇదమిత్థమని చెప్పరాని ప్రౌఢి ఉంది. పద్యశిల్పము విషయంలో స్వతంత్రగుణం విశదమవుతున్నది.

ఇటు చేయి వేసిన తాత హేలాకవిత్వాభిరాము
డటు చేయి వేసిన తాత యధ్యాత్మ విద్యానిధాను

డిటుం నా తల్లిదండ్రు లిర్వురకి పెట్ల మధుర
ఫలములు
చిటిలిన మధువేనొ కానొ చేకొమ్ము! పాంచాల
రాయ!

కవి అసగ నిట్లుండవలె, తాను చిటిలిన మధువు అయినా కాక పోయినా స్వామిని చేకొమ్మని అడుగుటలో కవికి స్వామితో గల చనువు వ్యక్తమవుతున్నది. సంఖ్య కూడా భక్తి మార్గాలలో ఒకదె కదా!

అందుకే ఇతర దేవతలందరును అతనియందే అంతర్భవించునట్లు కనుగొని ఇంకెవరినీ శరణు వేడనని చెప్పుకుంటాడు,

కడుపులోనున్న శిశువందె కార్చిచ్చు వొచు
నిల్చితివి
కడకేగి యాచించి తలను కాల్బెట్టి యణగ
ద్రొక్కితివి
తొడగి దొడ్డట క్షత్రకులము కులమెల్ల నరికి

అడిగెడు వాడు లేడాయె నయ్యెనిన్, పాం
చాల రాయ!

అంటూ నిలదీసి అడగడమూ చిత్రంగానే ఉంది. మానవీయభావం ఇందులో దర్శనమిస్తూ ఉన్నది. సంఖ్య దృష్టివల్ల మాత్రమే ఈమందలింపు.

కవికి కోట్లజన్మముల . లీనానుబంధమ్ము ఈశ్వరునితో కలదు. కనుక 'ఆత్మేశ'! అని సంబోధించుటలో ఔచిత్యమున్నది. సంబోధనలోనూ ఔన్నత్యమును ప్రదర్శించినాడు కవి. సర్వచేతస్సమాహార మూర్తి! విమల సరస్వతీ లాస్య విజ్ఞేయ! దోషాద! నిరవద్య! దయాదీప! త్రివిక్రమ! నానావతార సౌంచర్యనర్తన మృడ బంధు! ఆదిమవరాహ! సుధామనోజ్ఞ గోపాల! బలభద్ర! అనుచు సంబోధించిన కవి భగవానుని నవవిధ భక్తి మార్గముల తోను ఆరాధించుచుండుట కావ్యప్రేరణకు మూలము.

తపములు యజ్ఞముల్ విహిత దానమ్ములు ఏవీలేవనీ జపించి యెరుగననీ, సాంధ్య సావిత్రి యర్చనలేదనీ చెప్పుకున్న ఆచారాలపట్ల విశ్వాసంలేని ఆస్తికుడు. అయినను ప్రభువు కృప ప్రసరించింది. తద్వారా ఈస్తోత్రరత్నవిపణిని రచించినాడు. పోతనామాత్యుడు వ్రాయించెడి వాడు రామభద్రుండన్నాడు'. కవి' నీస్తోత్ర రత్న విపణిని రచింపజేసెదవు' అనుటలో భగవానుని చేతిలో తానొక ఉపకరణము అన్న భావన వ్యక్తీకరింపబడింది.

ఎగుడు దిగుడైన యీలోక, మిట దుఃఖ పంక
నిర్మగ్న
మగతికము, క్షుధానిరుద్ధమైన యీ నరస
మూహమ్ము ——
లగపడనట్టి సంకెళ్ళ యదుపుననుండె,కారుణ్య
దృగవధినేలుకో సుఖము దీపింప, పాంచాల
రాయ!

అగపడని సంకెళ్ళతో ఉన్న మానవాళికి శాంతి సుఖము కలగాలన్న కవిభావనలో సామాజిక శ్రేయస్సు కూడ మిళితమైయున్నది. బుద్ధిని కమ్మివేసిన మాయా విశేషాలు ఈ అగపడని సంకెళ్ళు. ఇవే కరుడు గట్టిన, అమానుషవైఖరితో కూడిన దురాచారాలు, నియమాలు, వ్యవహారవైఖరులు, వీటి నుండి విముక్తం' కావాలని కవి ఆకాంక్ష. అందుకు దైవం కరుణించాలి. మానవుని ఉత్తమ భావప్రపంచమే మానసిక నిర్మలత్వానికి మూలం. అట్టి ఔన్నత్య సాధన వల్ల భక్తి సాఫల్యము సిద్ధిసుంది.

శరణు, విశ్వాలయమున కొల్వు జాలిని చల్లని వేల్పు!

శరణు, సర్గస్థితిలయాది సంధాన దైవతత్వ
శరణు ప్రపన్న విమోక! సర్వారాధ్యీకృత తల్పు?

శరణు, శరణాగత రక్ష జయ జయ! పాంచాల రాయ!

ప్రభువు కృపా విశేషమే ఈ కవిచేత శతకము వ్రాయించెననుటలో విప్రతిపత్తిలేదు. స్తోత్ర రత్నముగాక ఇది మరొకటి యెట్లగును. వ్యక్తిగత సంస్కార వాసనా ప్రమేయము ఇట్టి కీర్తనలో దివ్యంగా ఆవిష్కృతమగుట ఆశ్చర్యమేమికాదు. ఏలయనగా కవి 'చిరిలిన మధువు'

కవి ఇటీవల వ్రాసిన (1987లో) శతాంకురలో 'నా మనస్సు నవవధువు కొత్త రుబాయీ పద్యంలో రోగి మనస్సు' అన్నాడు భావకవి తన్మయాన్ని అంతరార్థము. ఇట్టి ఆనంద వైభవము కలిగించు వాగ్దేవి కృప లభ్యమైనది. 'అమృత, అమృతాకారస్వరూప, ఆనందమోహిని, వాణి, వినుం రసఘని వాగ్దేవి పెంచేసే నాలుకపైన నిముసమేని వ్యవహారమీద నిలుపక కదియించు, లోని కుడదు, వెలిరాదు పెక్కులించెద పాంచాల రాయ!' కవి యొక్క మనఃస్థితి సువ్యక్తమయింది. వరంగల్లుకు ఏడెనిమిది మైళ్ళ దూరమున నున్న 'హవేలీకాయం పేట' యందు నెలకొన్న శ్రీ పాంచాలరాయస్వామిపై కవి వ్రాసిన శతకము ఆంధ్ర మాతృ హృదయ గత దివ్య తత్త్వ స్పర్శను విశిష్టాద్వైత మార్గంలో ఆవిష్కరిస్తున్నది.

సహకార కళాశాల
రుద్రంగి-506307
జిల్లా కరీంనగర్

# ఒక్కటిగా కలిసుంటే

ఒక్కటిగా కలిసుంటే
చక్కనైన వారలము
చక్కగా మనమున్నచో
చెక్కుచెదరదోయి

॥ఒక్కటిగా॥

పూవులన్ని ఏకమైన
మాలయగును ముద్దుగా
మనమటులే ఏకమైన
జాతి చూడ ముచ్చటలే

॥ఒక్కటిగా॥

ఏడురంగు లొక్కటైన
ఇంద్రధనస్సగునులే
మనమంతా ఒక్కటైన
జాతియొక్కటగునులే

॥ఒక్కటిగా॥

భేదాలను తొలగించిన
హృదయాలు సంతసించు
భావాలు ఒక్కటైన
భరతమాత మురిసిపోవు

కొండబత్తిని రవీందర్

# హిందీ సాహిత్యము- కుణాల్ గీత్ కి

రచన : డా॥ ఎం. చంద్రశేఖరరెడ్డి, ఎం.ఎ;
ఎం.ఇడి. పి.హెచ్.డి;
ఎ.పి. రెసిడెన్షియల్ స్కూలు,
కొడిగెనహళ్ళి,
హిందూపురము,
అనంతపురము (జిల్లా) 515 212.

సాహిత్య సమాజములు రెండును అవినాభావ సంబంధము కలవి సామాజిక పరిస్థితుల కనుగుణముగా సాహిత్య కృషి సాగుట సాహిత్య ప్రభావము సమాజము మీద నుండుట అనివార్యము. అంతియేగాక రాచరికపు వ్యవస్థ ప్రపంచమంతట ఇంచుమించు సమానముగా కనిపించును. ఆ వ్యవస్థ ననుసరించి ఆచార సంప్రదాయముల పరిణామము గుర్తెరుగ వచ్చును. మరియు ఆహార నిద్రాభయ మైథున క్రియలు, ఈర్ష్యాద్వేషములు జీవనరాశి యంతట సమానమే. కనుక ఈ దృష్టితో వ్రాయబడిన ప్రక్రియలలో స్థూలభేదము తక్కువే. అందువలన 'సారంగధరకథ'ను పోలిన కథలు ప్రాచ్య ప్రాశ్చాత్య సాహిత్యము లందును కనిపించుట సహజమే.

హిందీ సాహిత్యములో మైథిలీ శరణగుప్త 'కుణాల్ గీత్' కథ వంగభాషలోని 'కుణాలుకిథలు' ఆధారముగా వ్రాసినవే. మైథిలిశరణగుప్త్ ఈ కథను క్రీ.శ. 1940 సం॥ తరువాతనే రచించెను. ఈ కథ క్రిందివిధముగా హిందీ సహిత్యములో కలదు.

మగధ దేశమునకు రాజు అశోకుడు. ఇతని పట్టమహిషి పరిష్యరక్షిత. ఈమె అన్నివిధముల రాజునకనుకూలవతి, అనురూపవతి. వీరిరువురికి కుణాలుడను పుత్రుడుదయించెను. అతడు గుణవంతుడు. కుణాలుడు యువకుడు, రూపవంతుడు చక్కదనమున మన్మథుడు.

అశోకుడు తిష్యరక్షిత సౌందర్యమునకు ముగ్ధుడై ఆమెను రెండవ వివాహమాడెను. తిష్యరక్షిత తన సౌందర్యముచేత అశోకుని వశము చేసికొని, అతనిని గుప్పెటిలో పెట్టుకొని యాడించుచుండెను. తిష్యరక్షిత కుణాలుని సౌందర్యమునకు ముగ్ధయై అతనిని వశపరచు కొనుటకు సర్వప్రయత్నములు చేసినది. తన వంపును వెల్లడించినది. గుణప్రవరుడగు కుణాలుడు ఆమె కోరికను తిరస్కరించెను. ఇది తగదని తిష్యరక్షితకు బుద్ధి చెప్పెను ఆమె కామము క్రోధముగా పరిణమించినది. అతడు తనను పరిభవించినట్లు ఆమె భావించినది.

అవమాన దుఃఖభారముతో తిష్యరక్షిత పరిపరి విధముల క్రుంగిపోయినది. శోకాక్రాంత మనస్కయై విలపించినది. కుణాలుడీదుర్వృత్తాంతము నెక్కడ తండ్రికి తెలుపునోయను భయము సైతమామెను పీడింప దొడగినది. కుణాలునిపై ప్రతీకారము తీర్చుకొన ప్రయత్నించినది. రాజును తన వలలో వేసికొనెను. కుణాలునిపై లేనిపోని నిందలు మోపి, అతడు తనను బలాత్కరించినట్లు రాజుతో

కొంచెమునను చెప్పి కుణాలుని కళ్ళు పీకించినది. కుణాలుని సౌందర్య మంతయు అతని కన్నులలో నున్నది గనుక తిష్యరక్షిత ఆ కన్నులను పెకలించుటలో తన పగ తీర్చుకొనినది. నట్టడవిలో కన్నులను పోగొట్టుకొనిన కుణాలు ఒక అంత్యజ మిత్రుని సహాయము వలన తిరిగి కన్నులను పొందెను రాజ్యమును రోసి త్యజించెను. తన భార్య యగు కాంచనమాలతో కూడి తక్షశిలా సంఘారామమునకు వెళ్ళి తపస్వి అయ్యెను.

తెలుగు సాహిత్యంలో సారంగధర కథకు హిందీ సాహిత్యములోని తిష్యరక్షిత కథకు కొన్ని పోలికలు కన్పించు చున్నవి. ఈ కథలో గమనింప దగిన ప్రధాన అంశములు రెండు మొదటిది శిక్షా విధానము కుణాలుని కన్నులు పెకలింప బడినవి గాని కాళ్ళు చేతులు ఖండింప బడలేదు. రెండవది కుణాలుడు భార్యతో కూడి తక్షశిలకు వెళ్ళి తపస్వి యగుట ఈ కథను పోలిన కథలు తమిళ సాహిత్యములోను ఆంగ్ల సాహిత్యములోను కన్పించు చున్నది.

హిందీ సాహిత్యములో సోహన్‌లాల్ ద్వివేది 'కుణాల్' డా॥ సత్యేంద్ర కుణాల్ ఏకాంకిక నాటికలుగా కూడ రచించిరి, ఇవి మైథిలీ శరణగుప్త కుణాలగీత్ కథను పోలియున్నవి. ఈ విధముగా ఇతర భాషలలో ప్రసిద్ధి గాంచిన కొన్ని కథలను ఇతర భాషా సాహిత్యములోను కవులు రచించుట సహజము అందువలననే వంగభాషలోని కథను గ్రహించి అందరు కవులు తమ తమ భాషా సాహిత్యముల కనుగుణముగా రచించిరి.

## తా(ధ)రలు

నింగిలోని తారల్లారా!
మీరందరికంటే
ఎత్తులో ఉన్నామని
మురిసిపోకండి
ఎందుకంటే-
మానేతల ఆశీర్వాద బలంతో
ధరలు మిమ్మల్ని మించిపోతున్నాయి
కాకుంటే
మీది ప్రత్యక్ష దర్శనం
వీటిది అదృశ్యరూపం
మీరు వెలుగు నందిస్తే
ధరలు వెలుగు నార్పుతాయి
అంతే తేడా!!

**ఎస్.వి.ఎస్. సాయిప్రసాద్ ఎమ్.ఎ.**

# వార్తావాహిని

## సహాయక ప్రచారక విద్యాలయం ఓల్డ్ టౌన్ అనపర్తి

ది 8-2-91న సహాయక ప్రచారక విద్యాలయం ఓల్డ్‌టౌను నందు శ్రీ రేతలి త్రినాధ రెడ్డి గారి అధ్యక్షతను సహాయక ప్రచారక శ్రీ సాహిత్య 'రత్న' విద్వాన్ కర్రి పట్టాభిరాం రెడ్డి యమ్.ఎ యమ్.ఫిల్. గారి అభినందన సభ ఏర్పాటు చేయబడినది. గత సెప్టెంబరు నుండి ఈతేదీ వరకు సుమారు 60 మంది విద్యార్థులను సభ వారి వివిధ పరీక్షలకు అహర్నిశలు కృషి సల్పి తర్ఫీదు నిచ్చి వారమునకు ఒక పరీక్ష మరియు స్టడీ మెటీరియల్ తమ స్వంతముగా తయారు చేయించి సైక్లో చేసిన ప్రతులనిచ్చి హిందీ భాషా ప్రచారమునకు కృషిచేయుచున్నందుకు కృతజ్ఞతా పూర్వకముగా విద్యార్థులు ఈ అభినందన సభ ఏర్పాటు చేసినారు. అనపర్తి గ్రామము వచ్చినప్పట్నుంచి అనపర్తిలో మహిళలు, వ్యాపారస్థులు ఉద్యోగులు హిందీ నేర్చుకొనుచున్నారనియు తను కూడరాష్ట్ర భాష పరీక్ష వీరివద్ద తర్ఫీదు పొందియున్నానని వారికి నా కృతజ్ఞతలను తెలియపర్చి రాబోవు ఆగష్టు బ్యాచీకి హెచ్చు సంఖ్యలో పయోజనులకు ఉద్యోగులకు ఉచిత హిందీ తరగతులు నెలకొల్పిన బాగుండుననియు తమ తండ్రిగారగు శ్రీ రేతలి రాంరెడ్డిగారి ద్వారా త్వరలో ఇచ్చట సభవారి టంకణ విద్యాలయము నెలకొల్పుటకు ప్రయత్నించెదననియు శ్రీ పట్టాభి రామారెడ్డి గారిని తమకు తగిన సలహానిచ్చి మార్గదర్శనము చేయవలెననియు ఇదివరలో జాలికోన్నత పాఠశాలలో హిందీ పరీక్షలు జరిగినతేదీ ప్రమాణపత్రములను ప్రవేశ పత్రములలో వేయించిన ఉపాధ్యాయులపై సభకు తెల్పి హిందీ పరీక్షలను సక్రమంగా నిర్వహించుమనియు అనేక మంది తల్లి దండ్రులు సలహా నిచ్చినారనియు తమ గురువర్యులకు ఈ సందర్భమున తమ హార్దిక ధన్యవాదములు, అభినందనలు తెలియపర్చిరి. తదుపరి అనేకమంది విద్యార్థులు ఉపన్యసించిరి. తేనీటి విందు తర్వాత 1991 ఫిబ్రవరికి జి,బి. ఆర్ జూనియర్ కళాశాల, అనపర్తి కేంద్రములో పరీక్ష వ్రాయు పరీక్షార్థులతో ఛాయాచిత్రము తీయ బడినది. ఈ అభినందనలను ప్రచారకులు పట్టాభిరామా రెడ్డిగారు సముచిత రీతిని సమాధానమిచ్చి పూజ్యబాపూజీ స్థాపించిన దక్షిణ భారత హిందీ ప్రచారసభ (ఆంధ్ర) వారి పరీక్షలు నడిపే విధానమును కొద్దిగ సంస్కరించుటకై విజ్ఞప్తి చేయుదుననియు ఎక్కువ సంఖ్యలో హిందీ నేర్చుకొని జాతి, మత ప్రాంతీయ, భాషా ద్వేషములను విస్మరించి ఏక్ రాష్ట్రభాషా హిందీహై ఏక్ హృదయహో భారతజననీ 'అను సభవారి ఉద్దేశ్యము నెరవేర్చవలెననియు విజ్ఞప్తి చేసినారు. తదుపరి విద్యార్థి నాయకుడు శ్రీ కాపూరి సత్యానందరెడ్డి ధన్యవాద సమర్పణ జరిగినది. జనగణమనతో సభ ముగిసినది.

# హిందీ ప్రేమీ మండలి మహా విద్యాలయం, తెనాలి

దీ. 1-2-91న దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు మాజీ ప్రధాన కార్యదర్శి 'పద్మ భూషణ్' డాక్టర్ మోటూరి సత్యనారాయణగారు తెనాలి హిందీ ప్రేమీ మండలి మహా విద్యాలయం విచ్చేసిన సందర్భమున, మండలి అధ్యక్షులు ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు తామ్ర పత్ర గ్రహీత శ్రీ వెలువోలు సీతారామయ్య గారి అధ్యక్షతన సమావేశం జరిగినది. హిందీ ప్రేమీ మండలి వ్యవస్థాపకులు శ్రీ బోయపాటి నాగేశ్వర రావుగారు స్వాగతం పలికారు. పుర ప్రముఖులు, సాహిత్యాభిమానులు, సాహితీవేత్తలు పాల్గొన్న ఈ సమావేశం ఎంతో ఆసక్తిదాయకంగా జరిగింది. ఈ సందర్భంలో డాక్టర్ మోటూరి సత్యనారాయణగారు, రాజ్యాంగ నిర్ణయ సభ (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ) సభ్యునిగా, రాజ్యాంగంలో 14 భాషల్ని పొందుపరచడాన్ని గూర్చి ప్రసంగిస్తూ-ఇతర భాషలవలె హిందీ ఒక ప్రాంతంవారు మాట్లాడు భాషగా ప్రచారం పొందినా, దేశభాషలన్నింటినీ ఆకళింపు చేసుకొని సుసంపన్నమైన హిందీ, జాతీయభాషగా అర్హత కలిగినదని తాను సూచించినట్లు స్పష్టపరిచారు. వివిధ భాషలు గల ఈ దేశంలో, అందరినీ సమైక్య పరచగలిగినది హిందీయేనని, దేశసమగ్రత జాతి సమైక్యత ఈ భాష ద్వారా సంభవమని విశదపరిచారు.

నేడు మత వైషమ్యాలు, భాషా భేదాలు, వర్గ విగ్రహాలు విభేదాలపట్ల తీవ్ర విచారం తెలియజేస్తూ ప్రజలలో జాతీయతపట్ల సరియైన అవగాహనలేదని, ఆధ్యాత్మిక దృష్టి పెంపొందితే అనేక సమస్యలు పరిష్కారం కాగలవని. ఈ దిశలో తగినకృషి జరగడం అవసరమని సూచించారు.

రాజ్యాంగం మౌలిక సూత్రాలపై గౌరవం పెంపొందిస్తూ మన భారత రాజ్యాంగం శిరోధార్యమన్న భావం మన దేశ ప్రజలలో బల పడలేదని, దానిని అన్ని భాషల్లోకి అనువదించక పోవడం ఆశ్చర్యకరమని శ్రీ మోటూరి అన్నారు. జాతీయత విస్తరించనంత వరకు జాతీయ ప్రభుత్వం జాతీయ విధానాలు దేశంలో కొనసాగజాలవని, జాతీయతా గౌరవం లభింపదని హెచ్చరించారు.

'చైతన్య వేదిక' అధ్యక్షుడు డాక్టర్ పాటిబండ్ల దక్షిణామూర్తి, 'కాంతిపుంజ' అధ్యక్షుడు ప్రముఖ రచయిత డాక్టర్ కొత్త రవీంద్రబాబు, శ్రీ అరవింద విద్యాకేంద్రం వ్యవస్థాపకుడు శ్రీ గుళ్ళపల్లి సత్యనారాయణ ప్రభృతులు ప్రసంగించారు.

ధన్యవాద సమర్పణతో సభ ముగిసింది.

సెక్రటరి
హిందీ ప్రేమీ మండలి
తెనాలి-522 201.

# సమైక్యతే శరణ్యం

వాసాల నరసయ్య

అక్షరాలు తిరగబడితే-
శబ్దం రూపు దిద్దు కుంటుందా?
శబ్దాలు మొండికేస్తే-
వాక్యం నిండ గలుగుతుందా?
వాక్యాలు మొరాయిస్తే
అర్థం స్ఫురిస్తుందా?

హృద్యమైన పద్యం కోసం-చరణాలు
భావస్ఫోరకాలైన వాక్యాలకోసం-శబ్దాలు
అర్థవంతమైన శబ్దాలకోసం-అక్షరాలు

ఐక్యంగా వ్యవహరిస్తాయి
సహజీవనం చేస్తాయి
అలాగే తమ్ముడూ!
మరి అందుకే అమ్మడూ!
సమైక్యతే అన్నింటా
శరణ్యం అన్నివేళలా



## సహాయక ప్రచారక విద్యాలయం, ఓల్డ్ టౌన్, అనపర్తి.



ది 8-2-91 న కర్రి పట్టాభిరాంరెడ్డి (ప్రచారక్)గారి అభినందన **సభ**

(వార్త 46 వ పేజీ

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, హైదరాబాదు

## కార్యకారిణి సమితి మరియు నిధి పాలకమండలి సభ్యులు తేది: 10-3-1991



కుర్చీల్లో కూర్చున్నవారు : ఎడమనుండి; సర్వశ్రీ పిన్నమనేని ప్రసాదరావు (కార్యదర్శి), కె. సుధాకర్, కాజ వెంకటేశ్వరరావు, బి. వెంకట రామారావు, యమ్. వేదవల్లి. బోయపాటి నాగేశ్వరరావు (ఉపాధ్యక్షులు), వేమూరి సుబ్బారావు (అధ్యక్షులు), పటగర్ల రామ మోహనరావు (ఉపాధ్యక్షులు), వేమూరి రాధాకృష్ణమూర్తి (కోశాధ్యక్షులు), గుడివాడ పుల్లారావు.

నిలుచున్న వారు : మొదటి వరుస : సర్వశ్రీ కడారు మల్లయ్య, కొడాలి రామారావు, బి. అంజయ్య, చవాకుల నరసింహమూర్తి, యమ్. పి. మోహన్, ఈమని దయానంద, చింతలపూడి కుసుమహరనాథశర్మ, వై. పోలేశ్వరరావు, బెహరా ఉమామహేశ్వర రావు, మక్కపాటి వెంకటరత్నం, యన్.సి.హెచ్. సత్యనారాయణశర్మ.

నిలుచున్నవారు : రెండవవరుస : సర్వశ్రీ కొప్పరపు ప్రహ్లాదగుప్త, యమ్.శేషాచారి, బి.జి. సుందరమూర్తి, పి. ఓబయ్య, కె ఆర్. చంద్రప్రకాష్

Edited, Printed and Published by P. Prasada Rao on behalf of the D.B. Hindi Prachar Sabha-Andhra, Khairatabad, Hyderabad-500 004.